తన తండ్రి తులజేంద్ర ధరణీశు పేర
జెనుపొంద మకరంద బిరుదాంకు పేర
రమణీయమైన యీ రామాయణమున
కమనీయ సుందర కాండంబు జెప్పె
నిది తుళజేంద్రుల కిడునెప్పుడిలను
పొదలు సంపదలును పూర్ణశక్తులును
సకల దీర్ఘాయుష్య సంతానములను
సకల రాజ్యంబుల సకల భోగముల
సమర జయంబుల సకల కీర్తు
లమరంగ నొసఁగు మహారామ చరిత
మిదిమహాపుణ్యదమిది వేదసార
మిదిముక్తి సోపానమిది శుభోదర్క
మివ్వసుంధర భక్తినెలమితో దీని
నెవ్వరు చదివిన నెవ్వరు వినిన
నెవరు వ్రాయించిన నెవరు వ్రాసినను
భువిలోన వారికి పుత్ర సంపదలు
ఘనమైన కీర్తులు కరితురంగములు
మనసురంజిలజేయు మాని నీ మణులు
పరగ దీర్ఘాయుష్య భాగ్యంబు లొసగు
ధరణిలో నా చంద్రతారార్కముగను

—: శ్రీరామ చంద్రాయనమః :—

# యుద్ధ కాండము

శ్రీరఘు వీరుండాశ్రిత ప్రాప్తజాతుం
డారూఢిగను సమీరాత్మజు చేత
జనక సేమంబు సకలంబు దెలిసి
మనసు రంజిల హనుమంతు దీవించి
ఆలింగనము జేసి యతనిచే నప్పు
డాలంక చొప్పెల్ల నాను పూర్విగను
విని తన మదిలోన విస్మయంబంది
దిననాథ సుతుజూచి తెరగొప్పనీవు
విశదంబుగా నేడు విజయలగ్నమున
దశముఖుపై దండు తరలింపుమనిన
సుగ్రీవు ననుమతి సొరది వానరులు
నిగ్రహానుగ్రహ నిధిరాము కెరిగి
నిరుపమా కృతిగల నీలు వెంబడిని
పరగ నార్చుచు తమ పాదఘట్టనల
ధర పెల్లగిల్ల దిక్కూటములు దుల్ల
శరధులు కలంగ నిర్జరులుల్లసిల్ల
తడయక సింహనాదములు సేయుచును
నడచిరసంఖ్యులై నానాముఖముల
హనుమంతుపై రాముండగదు మీద
ఘన పరాక్రముఁడు లక్ష్మణుఁడేగుదేర

వనచర భటులు కైవారముల్ సేయ
వనజాప్త సుతుండు కేవల భక్తినరుగ
మలయు సంధ్యాదుల మలక జూచుచును
వెలువడి వనచర వీరులతోన
కదలిని జూచి యక్కడ రాఘవుండు
విడియించె పాళ్యంబు వేడ్కతోనంత
రాముఁడేకతమున రవిజుని జూచి
యీ మహాంబుధి కపులే విధంబునను
దాటుదురిందుకు తగనుపాయంబు
పాటించి వేగ నేర్పరచు మటన్న
నాలోన రవి పశ్చిమాంబుధి గ్రుంకె
భూలోకమెల్లను పొదలె చీకటులు
వెలయు రాముని కీర్తి విలసిల్లు మాడ్కి
మలసి తూర్పున చందమామ చూపట్టె
నంత సూర్యోదయంబైన రాఘవుఁడు
సంతసంబున లేచి సౌమిత్రితోన
తడయక సాంధ్యకృత్యములను దీర్చి
కదలింతల సన్నికను గొనుచుండె
రావణుండక్కడ రాక్షసాధిపుల
రావించి యాకోతి రాయడి మీరు
కంటిరి గదుదుష్ట కపివేగబోయి
వెంటనే యా రామ విభుదెచ్చెనేని
శౌర్యంబు తప్పను గావున తగిన
కార్యమూహించి చక్కగ జెప్పుడపుడు
వినిమంత్రులాదైత్య విభుకిట్టులనిరి

దనుజేశ నీకింత దైన్యమేమిటికి
శరమర్థి నెత్తవాకైలాసగిరిని
సురుల శోధింప వాతూరుడై నీవు
నీముందరను దా నిల్వనేర్చునేరాము
డామర్త్యు వధియింప నల్పుండు చాలు
ననిబల్కి మంత్రుల నందరి జూచి
పెనగొన కినుకవిభీషణుండనియె
కారులాడెదరు పై కార్యమెంచకను
మీరొక్క మంత్రులే మీరొక్కఘనులే
పెరలెత్తకను సామభేదదానముల
సొరది శాత్రవుఁడు వశ్యుండు గాకయున్న
నామీద దండంబు నమరు మీరెట్లు
నేమైన యత్నంబు లేచి జేసితిరే
రామభద్రుని పరాక్రమ గుణంబులను
హేమగర్భునికైన నెంచంగ తరమె
మనుజ మాత్రుండని మదినెంచవలదు
దనుజాంతకుఁడు సుమ్మి దశరథాత్మజుఁడు
కనలేడా నిన్న రాఘవుదూత శౌర్య
మనిజెప్పివిని యా క్రినన్న కిట్లనియె
వినురాక్షసేశ్వర విక్రమోదార
చనటి మంత్రులమాట చెవిపెట్టవలదు
దేవిని లంకకు దెచ్చిన మొదలు
దేవ యీ పురలక్ష్మి దీనయై పొలిచె
తోచుచున్నది మహా దుర్నిమిత్తంబు
లే చందమున జూడనిది బుద్ధిగాదు

జనకజ గొంపోయి సరగున రామ
జనపాలమణికిచ్చి శరణంబు జొరుము
నీవంశ గరిమెను నీ జీవములను
నీవారినెల్లను నీవు రక్షింపు
మని చిలుకకు జెప్పి ముమ్మారు
చనబుద్ధి యా విభీషణుఁడు చెప్పినను
విని రావణుఁడు కోప వివశుఁడై జూచి
తన తమ్ముఁడనకను తన్నె తన్నుటయు
నా విభీషణుఁడు శోకాక్రాంతుడగుచు
వేవేగ రాక్షస విభునికి మ్రొక్కి
రావణా విను నీవు రాముబాణాగ్ని
కావరంబున గంగ గ్రాఁగెడు నాడు
తలచుము నా బుద్ధి తలఁపున నన్ను
తలఁచు మటంచును తరలయా క్షణమె
తన మంత్రివరులతో తగ విభీషణుఁడు
వినువీధిరాఁగ భావించి వానరులు
సమరసన్నద్ధులై చనుదేర జూచి
సముచితంబుగ విభీషణుండిట్టులనియె
రావణానుజుఁడనే రహి విభీషణుఁడ
వేవేగ శ్రీరామ విభునికి సీత
నిమ్మన్న దశకంఠుండెలమి కోపించి
పొమ్మన్న వచ్చితి భూనాథకడకు
ఘాతకుండనుగాను కపటినిగాను
భీతుఁడై వచ్చి విభీషణుండనుచు
శరణాగత త్రాణత సిద్ధాత్మతోన

కరుణించి తెలుపుఁడీ కపులార యనుచు
నామాట సుగ్రీవుండాలించి వేగ
రామునితో చెప్ప రఘురాముఁడనియె
నా విభీషణుండైన యర్కజ వినుము
రావణుఁడైన గర్వము దక్కివచ్చి
శరణన్న రక్షింతు సంశయంబెల్ల
ధర నివి క్షత్రియ ధర్మంబు సుమ్మి
యభయ మిచ్చితి నొందుసాత్మ నెంచకుమి
నభయ చిత్తుని విభీషణు తెమ్మటన్న
విని భాను తనయుఁడు విస్మయంబంది
చని కూర్మితో విభీషణు తోడితెచ్చి
ప్రేమతో శ్రీరాము భేటి సేయింప
నా మహాత్ముడు రాము కతభక్తి మ్రొక్కి
పరమాత్మ శ్రీవత్స పద్మపత్రాక్ష
కరుణించి నను ప్రేమగావవే రామ
శరణాగత త్రాణ చాప ప్రవీణ
కరుణించి నను ప్రేమకావవే రామ
చిరకీర్తిలోల కౌశిక యాజ్ఞపాల
కరుణించినను ప్రేమకావవే రామ
హరి యహల్యా ప్రఖాహర జగద్రూప
కరుణించినను బ్రోచి కావవేరామ
హరచాప భంగ మోహన సుందరాంగ
కరుణించి నను ప్రేమ కావవేరామ
ధరణీ సుతాధీశ తపన సంకాశ
కరుణించి నను ప్రేమ కావవేరామ

పరశురామా ఓల హంసశీల
కరుణించి నను ప్రేమ కావవేరామ
ఖరదూషణాది రాక్షస సంవిదార
కరుణించి నను ప్రేమ కావవేరామ
పర సద్గుణోదార వాలి సంహార
కరుణించి నను ప్రేమ కావవేరామ
యని సన్నుతులు సేయు నా విభీషణుని
తన దయాదృష్టిచే తనియంగజేసి
దనుజేశునికి నీవు తమ్ముడుగావు
తనకు తమ్ముడు నీవు తథ్యమ్మునమ్మి
యని జెప్పి యతనిచే మరి మర్మమెల్ల
పనువడిగా రామభద్రుండు దెలిసి
యా విభీషణునికి నద్ది తీరమున
భావించి లంకకు పట్టంబుగట్టి
కడలిని ప్రార్థించి గర్వించిమించు
కడలిని శరముల గావించి పిదప
జాతిగా నలునిచే బహుశుభప్రకర
హేతువశర్వించు నింద్రాది ధూమ
కేతువ గీర్వాణ కీర్తిత పుణ్య
సేతువ గట్టి ప్రవిత్ర వైఖరిని
జూచు వానరులు మెచ్చుచు మస్తకముల
నుంచు వానరులు నైయ్యువధితో దుముకి
యుండు వానరులెత్తి యలమి జంతువుల
యుండు వానరులు నిమ్ముల సేతు వీథి
బాడు వానరులును బట్టు వానరులు

సై రాము ముందరనాడు చూఁపగను
శ్రీరాముఁడన శ్రీ చెలువుగ చర సేనలు గొల్వ
తోరమైనట్టి సేతువ మీఁదఁబోయి
యదరక యీసువై్రి చంగటను
విడియించి పాళ్యంబు వేడ్కనందుండె
చారులచే రాము జననాథురాక
యా రావణుఁడు విని యాత్మ ఛిత్తిల్లి
శుకసారణుల పంప సౌరదియైవారు
సకల వానరవీర సైన్యంబు జూచి
వచ్చి చెప్పినను రావణుండాత్మలోన
నచ్చెరువొంది మహాసౌధ మప్పు
డెక్కి వానరసైన్యమీక్షించి బెదరి
సుక్కి యాసారణ శుకుల కిట్లనియె
నివ్వేటిల్లెడి కపి నివహంబులోన
నెవ్వండు సేనాని యెవ్వడు శూరు
డెవ్వడు రాముని కిష్టుడైయుండు
నెవ్వని ప్రాపున నీసేన నడుచు
నెవ్వడు లక్ష్మణుండు రాము
డెవ్వడు సుగ్రీవు డెవ్వడంగదుండు
మీరు నెర్వెర నెమ్మిగ దెల్పుఁడనిన
సారణుండపుడు రాక్షసనాథు కనియె
గురుతర కపినాయకు తల్లక్షగొల్వ
తరుచర సేనముందర నున్నవాఁడు
పరమ దుర్జయుఁడల్ల పావకసుతుఁడు
పరసైన్య నాథుఁడు వాఁడు నీలుఁడు

గరిమతో శతబృంద కపులు సేవింప
చురుకుచూపుల లంక చూచుచున్నాడు
వాలికంటెను దుర్వార విక్రముడు
వాలి నందనుండుల్ల కాతంగదుండు
ఘన బలాఢ్యుడు విశ్వకర్మ నందనుఁడు
పనువడి సేతువు బంధించినాఁడు
నగచర శతకోటి నాధుడైనాఁడు
నగధైర్యుఁడాతండు నళుడు లంకేశ
పరమేష్ఠి తనయుండు భల్లూక విభుఁడు
వరసనాతదు జాంబవంతుడు దేవ
వాఁడు గవాక్షుండు వాఁడు గజుండు
వాఁడుపో ద్వివిధుండు వాఁడు మైదుండు
వాఁడెపో శతవలి వాఁడె సంపాతి
వాఁడె ధూమ్రాదుడు జాంబవంతు తమ్ముండు
వాడింద్ర జానుండు వాఁడెపో హరుఁడు
వాఁడెపో క్రథనుండు వాఁడు తారుండు
వాఁడు కేసరియల్ల వాఁడె సుముఖుఁడు
వాఁడు సుషేణుండు వాఁడు విముఖుఁడు
జలనిధి లంఘించి జానకి గాంచి
ప్రోలుచు లంకాపురి పొరిగొన్న శూరు
డా వాయు తనయుండు హనుమంతుడితడు
నీవు నెరుంగుడు నిర్జరారాతి
కామరూపులు ధీరఘన తర శౌర్యు
లీమంద కపికులు లెన్నంగ తరమె
అని సారణుఁడు దెల్ప నా శుకుండనియె

వినుదేవ రఘురాము విక్రమ స్ఫురణ
సిలమెప్పము పోలు నెమ్మేని వాఁడు
శూలిపోలికె జటాజూటంబు వాఁడు
నిండు చందురువంటి నెమ్మోము వాఁడు
పుండరీకాక్షుండద్భుత వరాక్రముడు
కరుణా సముద్రుండు కమలా ప్రకులుఁడు
పరశరణాగత వజ్రపంజరుండు
భూమిజాక్షి చకోర పూర్ణచంద్రుండు
రామాభిరాముఁడు రాముఁడా ఘనుఁడు
ఆ రాము చేరువ సతిభక్తి నిలిచి
సీరుఁడై శరములు విల్లు చేబూని
వేమారులంక భావింపుచున్నాడు
సౌమిత్రి యాతడు స్వర్ణవర్ణుండు
గట్టిగా రఘురాము కారుణ్యారామ
పట్టాభిషిక్తుఁడై పరఁగుచున్నాఁడు
మనుజేశ్వరునికి నీ మర్మముల్ జెప్పి
చనువున మను విభీషణుండాతండధిప
ఆ రాముతోన మంత్రాలోచనముల
కోరి సేయుచు చెంత కూర్చున్నవాఁడు
వన చర ధీశుండు వాలి సోదరుఁడు
ఘన హేమమాలి కాకలితుఁడా రాముండు
యా రామచంద్రుని చేరి యా కిష్కింధ చేకొన్నవాడు
శూరత విలసిల్లు సుగ్రీవుడతఁడు
యీతని సైన్యంబు లెన్నంగ తరమె
ధాతకునైనను దనుజాధినాధ

యని విని వారుల ననిచి లంకేశుఁ
డానరంగ నొంటి విద్యుజ్జిహ్వు బిలిచి
రామాధి ధనువు శిరంబు పోలికను
నీ మాయనొక్కటి నిర్మింపుమనుఁడు
వాఁడట్లు నిర్మింపవాని కొండాడి
పొండిమీవని తేగి భూపుత్రి జూచి
రా కెందు ముఖియింక రామునియాశ
నీకేల నీపతి నిదురింపురుండ
నతని మస్తకము ప్రహస్తుండు కూల్చి
వితతంబుగా తలవిలుదెచ్చి యిచ్చె
ననుఁడు విద్యుజ్జిహ్వుండా చాపశిరము
లసుగ్రీవాద్దటు వైచి యరిగె నవ్వుడును నా
శిరము చాపము జూచి సీత మూర్ఛిల్లె
నరిగె రావణుండంత ననుహొంచ సభకు
మరల నా విలుతల మాయమై చనియె
సరమ మూర్ఛనుదెల్పి ఆనకజ కనియె
ఓరామ! నీకింత యలుక నేమిటికి?
యా రావణుని మాయయని నిశ్చయింపు
శ్రీ రాఘవుని యా ర్తి జెందునే యనుచు
గారవించగ సీత కరుణతో నుండె
నంత వానర ఘోషమాలించి మదిని
చింతించి చింతల చివికి రావణుఁడు
తొడరి ప్రహస్తుని తూర్పు వాకిటికి
కదిమి దైత్యుల గూర్చి కాపుండ బనిచె
దక్షిణంబున మహోదర మహాపార్శ్వ

లక్ష్మణు బలయుతులైయుండ బనిచె
వలగొని పడమటి వాకిటియందు
చెలువుమీరగ నింద్రజిత్తును బనిచె
దనుజుల గూడి యుత్తరపు వాకిటికి
జనుఁడని పనిచెను సారణశుకుల
పుర మధ్యముననుండ పుత్తెంచెనప్పు
డరి భీకరుండగు నా విరూపాక్షుఁ
డంత రాముఁడు సువేలాద్రిపై నెక్కి
యింతగా లంకను వీక్షింపుచుండ
వన చరార్భకులు భూవలయంబు నిండ
విని పంక్తికంఠుడు విభవంబుతోన
గోపురంబున వచ్చి కూర్చున్న జూచి
భూపాలుండప్పుడద్భుతమంది పలికె
వినుము విభీషణ వీఁడెవ్వడనిన
తనయన్న యీతఁడు దశకంఠుడనుడు
తామరసాప్త సందనుండంత చూచి
రామునికిని మ్రొక్కి రావణుపైని
కుప్పించి దాటి నెక్కొన్న కోపమున
నప్పంక్తి కంధరునరరంట మొత్తి
తనపేరు చాటి యాతని కిరీటములు
పనుపడితన్ని దోర్బల శక్తిమెరయ
రావణుండా కపి రాజును బట్టి
వావిరి గదకొని వక్షంబు పొడువ
కడగి వారిద్దరు కంతుక ద్వయము
పడువున కంఠీరవముల చందమున

కలయునంగంబులు లేకంబుగా పెనగ
సొలసి వెంబడి రాక్షసుఁడు మాయలన్న
కని వానరేంద్రుండు గ్రక్కున నెగసి
చని రామునికిని మ్రొక్క జననాథుఁడంత
యాలింగనముజేసి యతని కొండాడె
యా సులోచన యాసువేలాద్రిని దిగ్గి
వనచరావళితోన వచ్చి రాఘవుఁడు
దనరంగ దిగ్గె నుత్తరపు వాకిటను
వలిముఖులను గూడి వచ్చి నీలుండు
వలనొప్పదిగ్గె పూర్వ ద్వారమునను
తడయక దక్షిణద్వార మంగదుఁడు
కడువడి బంధించ కపులను గూడి
గురికొని పడమటి కోట వాకిటను
హరుల తోడుతగూడి హనుమంతుడుండె
పది యోజనంబుల పరువున నిట్లు
పరలక వర్తించె వానరసేన
యప్పుడు రఘురాముఁడంగదు బిలిచి
తప్పక నీవేగి దశకంఠుతోన
నికనైన జనకజ నిమ్మని బలుకు
సకల బాంధవులతో చనవలదనుము
కాదేని శూరుఁడై కదనంబు సేయ
నా దటరమ్మని యతనితో దెలుపు
మన మ్రొక్కి యంగదుండప్పుడె కదలి
దనుజనాథుని సభాస్థలి నిల్వఁజూచి
ఘనకుండు క్రమ్మర నేతెంచె ననుచు

దనుజులారనిబట్టి దట్టింపబోవ
వారి వారించి రావణుండు భావించి
తారాత్మజుని జూచి తగనిట్టులనియె
నెవ్వని తనయుండ వెవ్వని బంట
నెవ్వంక నీవు పేరెరిగింపు మనుడు
ఓరి రావణ! తోకనాగి నిన్నుగట్టి
వారిధి ముంచిన వాలినందనుండ
నీ కొవ్వు పోలియించి నిను చెరగొన్న
యా కార్తవీర్యుని నణచె భార్గవుడు
నట్టి భార్గవ రాము ననిలోన లీల
పట్టి గెల్చిన రామభద్రుని బంట
నంగదుండను నీకు ననుపువచ్చింతు
నింగితజ్ఞుడవేని హితవుగా గొనుము
శ్రీరామునికి నీవు సీత నొసగి
నీ రాజ్యమెల్లను నీవు రక్షింపు
చెడు బుద్ధిచే నీవు సీతనీకున్న
కదగి యుద్ధమునకై కదలుమీక్షణమె
నీవు రాకున్నను నీదు జీవములు
నా వానరేంద్రులు హరియింతురని నవ్వ
దన విని దశకంఠుడతని బాధింప
దనుజుల బంచిన తారానుతుండు
తనుబట్టి బాధింప దైత్యులనెల్ల
వినువీధి గొంపోయి విదలించివేచి
రాము సన్నిధికేగి రయమున మ్రొక్క
రాముడంగదునిపై గాగిల్లుచుండె

నంతట చాలించి యా సభకేగ
డక్షత[?]పురంబున కరిగె రావణుండు
రాముఁడంతట కపిరాజును జూచి
భామసించక నీవు తగలంక లగ్గ
పట్టింపుమన విని భానుజుందనుప
పట్టల్కతోడుత కపులెల్లగూడి
వికవిగా వాలముల్ విసిరి యాడుచును
తరువులు గిరులు నుద్దతి చేతబూని
యగ్గలంబున వచ్చి యాలంక కోట
లగ్గబెట్టిరి కొందలము దైత్యులంద
నీరీతి కోటల నెక్కి వానరులు
వీర నాదములతో వెదలి రాక్షసులు
శూలంబులను గ్రుమ్మి సురియల పొడిచి
కాల దండోద్దండ గదలను మోది
భిండి వాలములచే పిండిగా కొట్టి
దండించి కపులను తరిమిన పోక
కపులు కోపించి రాక్షసులపై కదిసి
విపరీత నఖముల విదళించి చించి
తరువుల మొత్తి భూధరముల నడచి
పురిగొని పోరాడ భువనముల్ వణకె
శరధులు కలంగె భూతలము కంపించె
తెరలి భూనభములు కెందూళిగమ్మె
నప్పుడు రావణుండఖిల రాక్షసుల
రప్పించియు చించి రణముకై బనుప
వారణంబుల నెక్కి వాజులనెక్కి

దారుణంబైన గార్దభముల నెక్కి
యతులితంబు కనక శతాంగంబు లెక్కి
ప్రతిలేని శౌర్య సంపదలను మెరసి
భేరీ మృదంగాది భీమనాదములు
వీర దైతేయుల వీర నాదములు
భూనభోంతరములద్భుతముగానింగ
దానవుల్ కపుల నుద్ధతిదాక జూచి
కదఁగి దైత్యుల తాకె కపిసైన్యమపుడు
తరయక ద్వంద్వయుద్ధంబయ్యెనందు
కడిమియై తాకెనంగదు నింద్రజిత్తు
జడియ సంపాతి ప్రజంఘుండు తాకె
ననుపమ విక్రముండతి కాయుఁడంత
వినతుని రమ్మని వెసతాకి పోర్చి
కదఁగి వాని రథంబు కదపెంగదుఁడు
సారె ప్రజంఘుఁడు సంపాతి నదచె
వారక సంపాతి వాని వధియించె
వినతరువుల తాకె వెసనతి కాయుఁ
డని వారు లిద్దరు నతని నొప్పించి
రా సుషేణుని దాకె నటుమహోదరుఁడు
నా సుషేణుండు గూల్చె నా మహోదరుని
మకరాక్షు నెదతాకె మహిజాంబవంతు
నాకట విద్యుజ్జిహ్వుండాగి శతావలిని
కలయ విక్రమ ధనుగజుఁడు వధియించె
తొలఁగక కుంభుండు ధూమ్రు మార్కొనియె
తిరిగె గవాక్షుపై దేవాంతకుండు

శరభుని త్రిశిరుండు చలమున కదిసె
అల వనసునిపై నరాంతకుండలిగె
కలయంగ కుముదుండకంపను దాకి
కేసరిపైనచ్చెకి నిశిధూమ్రుండు
యీ సునతుకు దాకె నిలవేగదర్శి
అలగంధమాదనుండా మహాపార్శ్వ
నలుదాఁకె తపనుడున్మత్త జంబుమాలి
హనుమంతు దాఁకిన నతడు బంధించె
ననిదాఁకె మిత్రఘ్నుడా విభీషణుని
యా రవిజుండు ప్రహస్తుని నుంచె
పోరిమైందుతు వజ్రముష్టిని గూల్చె
యశని ప్రభుతువి గూల్చెనా ద్వివిదుడు
అశని తుల్యానికుంభుండా నీలు కవిసె
చని విరూపాక్షుండు సౌమిత్రిదాఁక
దనుజుని శరముల దట్టించ నతఁడు
రాముపై ను ప్తమ్కు రశ్మి సేతుమట
నా మేయినాగ్ని కోపాగ్ని సేతువులు
చలమున వెనదాక జననాధుఁడలిగి
నలుగురి నిలగూల్చె నాల్గు బాణముల
ఆ త్తరి భంగంబులైన చాపములు
తుత్తుము రైనట్టి తోమరంబులును
విరిగిన రథములు వెసబారు హరులు
కరిఖండలైనట్టి కరి శిరంబులును
కోర జీవముల దన్నుకొనెటి దైత్యులును
పౌరలు సారథులు వాపోమయోధులును

కలిగి భయంకరా కారమై యొప్పె
కలితరక్తౌఘ సంగర భూమి బాద
యంత నక్కడు పశ్చిమాంబుధి గ్రుంకె
వింతగా చీకట్లు విరిసె దిక్కులను
తమ వేగాంగనుద్దండ రాక్షసులు
గమనించి కపులతో కయ్యంబు సేయ
పడి శుకసారణ వజ్రదంష్ట్రిలును
తదయక నా మహోదర మహాపార్శ్వ
రా మహాకాయుఁడత్యంత బాణముల
రాముని నొప్పింప రాఘవుండలిగి
యనలాస్త్రమున తను చిత్తమునణచి
యనుపొంద శరణుల వారు సంధించి
యార్థురి దైత్యుల నగరంట న్యాయ
నార్థురినిల్వక నటపారిరండు
కలదైత్యులెల్ల రాఘవు బాణవహ్ని
శలభంబులై పడి సంసిరంరటను
అవని నంగదుడిట్లు సరదంబు గూల్చ
నవ పర్వతాలకు వేగజని యింద్రజిత్తు
నవిరళ బలశాలి యా యింద్రజిత్తు
చెత్సర రాక్షస సేనలగూడి
వచ్చి యదృశ్యుఁడై నడిచివినుండి
మసలక రామ లక్ష్మణులపై వేయ
నస్త్రశకాండంబు లందందనిచ్చి
వానరావళినంప వానలోసొచ్చి
పూనియార్చగఁజూచి పొదలి లక్ష్మణుఁడు

కనుగొంటివే రామ కపటరాక్షసుఁడు
వనచర సేనవాఁరిగా గూల్చె
మొనసినే బ్రహ్మాస్త్రమున వీనిద్రుంతు
ననవిని రఘురాముఁకను జన్మఁజూచి
చనునె యొక్కరునికై సమయింప జగము
మునము రాజధర్మము జూడ వేమి
వెరచిదాగినవాని వెన్నిచ్చువాని
శరణు చొచ్చినవాని చనిమ్రొక్కువాని
కదనంబుతో పూరి కరచినవాని
వదలియాయుధముల వనరెడువాని
తలజూపకనునని డాఁగినవాని
ఎలమితోడుత పుట్టలెక్కడివాని
నిద్రలోయెదువాని నిర్జింప తగదు
భద్రంబుగోరు భూపలికి సౌమిత్రి
వనచరులను వీని వధియింప పంపు
మన సుమిత్రా పుత్రుఁడాగ్రహించెనగ
పరభయంకరుండగు పనకేసరిని
శరభుని నిషధుని సన్నాదుగజుని
వరుసనీలుని జాంబవంతుని బసువ
వానరపతులు పర్వత మహీజముల
పూనియప్పుడు నభంబునకు చిట్టెగయ
నా రావణాత్మజుండలిగి బాణముల
వారించి పడవైచి వసుధపై కపుల
బంధురంబుగ లోక బాంధవాన్వయుల
బంధించదనటు నాగపాశ సంతతుల

తపసీశులపుడు సీతాహి పాశముల
వివశులై యున్నంత వీక్షించి నగుచు
చనియింద్రజిత్తు రాక్షసలోకపతికి
వినిపించ తనగల్పు వివరంబుగాను
తనయుని కొండాడి దశకంఠుడంత
జనకజకీమాట చక్కగా దెల్పు
డని రాక్షసస్త్రీలనంప వారరిగి
తిన్నగా హితవుదెల్ప భూపుత్రి
విన్నంత ధృతిమాలి విలపింప దొణగె
కటకటా రామనీ కార్ముఖ విద్య
లెటబోయె నీదైర్యమెటు బోయెనేడు
సకల లక్షణ బల సంపన్నుడయ్యు
నొకదైత్యుచే నిట్ల నొందాట తగవె
సౌభాగ్యవతి యంద్రు జనములునన్ను
నా భాగ్యమిట్లయ్యె నాథయేమందు
హానాథ! హావీర! హారామయనుచు
జానకి శోకింప సదయయై త్రిజట
ఓదేవి! నీకింత నలుక నేమిటికి
యాదయాంబుధి రాముడను జన్మతోన
నున్నాడు సుఖముగా నోయమ్మ జూడు
నన్ను వీక్షింపుము నామాట నమ్ము
కాదేని యీ పుష్పకంబేల మోచు
రారాత్రి నీకని రమణినూరార్చి
సుందరి త్రిజట యశోకవనంబు
నందు క్రమ్మరదెచ్చి యవనిజనుంచె

శ్రీరాముడట మున్ను చెలువొప్పదెలిసి
వీరుని సౌమిత్రి వెరగంది గాని
చూడు నా తమ్ముని సుగ్రీవ నేడు
పొడి·దప్పిటువలె పడియున్నవాఁడు
నితని బాసిన వెన్కఁ నీ జీవమేల
ప్రతిలేని జయమేల భామినియేల
కట కటాద్రియ్యారు కాంతలు వత్తు
రిటువంటి తమ్ముని నేనెందు కందు
పురమునకేనొంటి బోవుదునెట్లు
భరత శత్రుఘ్నులు పరఁగ తల్లులును
సౌమిత్రియేదన్న సన్నిధునుండి
యేమందు వారలకేమి జెప్పుదును
యీతఁడు నా జీవమిత్రుఁడు నా బంధు
వీతనితో గూడ వేవేగువాఁడ
సరుగుము కిష్కింధకర్కాజు నీవు
తరుచరులను గూడి తాసుసించకను
యన విని సుగ్రీవుఁడా రాము జూచి
జననాథ నీవిట్లు చలియింప తగునె
తొడరి నొక్కొక్క వేళతోచు నాపదలు
విడుతురే ధైర్యంబు విశ్వలోకేశ
యనిపల్కి రవిసూనుడంగదు బిలిచి
తనయ నీవింక నీ దశరథాత్మజుల
కొని బొమ్ము కిష్కింధకును నేను వేగ
తన యాప్తమిత్ర బాంధవులతో గూడ
రావణు పరిమార్చి రయమున లంక

నీవార్థిలోపల నేర్పుగముంచి
వానరాధిపులతో వలనొప్పకేసు
జానకి కొనివత్తు జననాథు కడకు
ననుఁడు విభీషణుండా రాము జూచి
తనమది శోకించె ధైర్యంబు వదిలి
యదరని దుఃఖంబు లందంద పొదల
సుడిగొని కపులెల్ల శోకించి రంత
నా సుషేణుఁడు వచ్చి యక్కడఁ జూచి
వాసి దప్పిటువలె వగచుట తగవె
హనుమంతు నంపించి యౌషధశైల
మనువొంద దెప్పించు మనుచుండె నపుడు
యారూఢమగు సమృతాబ్ధి యుత్తరపు
తీరంబు నందుండి దిగ్గనలేచి
రెండు రెక్కలతోన రేగి పైనుండి
కొంత చందంబున ఘోయని యార్చి
తరుచుగా నింతి వతత్ర వాయువులు
గిరుల వృక్షముల మిక్కిలి పెల్లగింప
ఘనుకోటి ప్రభా భాసురుఁడగుచు
నైన తేయుఁడు రాగవనచరుల్ జూచి
వెరగొందుచుండనా వినతాతనూజుఁ
దరుదేరి నృపతుల నందంద జూచి
సురుగు రెక్కల చేత మేనులు నిమిరి
యురగపాశమ్ముల నెరగి విదారించి
యీ నాగపాశమ్ములిటు మిమ్ము బాసె
భానహాధముడగు దశకంఠు ద్రుంచి

ధరణీశ గానినయోధ్యకు బొమ్మురామ
సరసతనే నీకు సఖుఁడనై యుందు
ననిచెప్పి పక్షీంద్రుడమృతాబ్ధి కరిగె
జననాథులంత సుత్సాహులై యుండి
రా మహా వానరులానందమునను
రామ లక్ష్మణులకు రహిమ్రొక్కిరంత
శంకింపకను కపి సైన్యంబు లెల్ల
లంకా పురంబుగ లంగసార్వంగ
నంత సూర్యోదయంబైనను జూచి
వింతగా రాముని వృత్తాంత మరసి
దారులు వేల్ప రాక్షస విభుండలిగి
ఘోరికై ధూమ్రాక్షు పొమ్మన్న వాఁడు
భేరులు శంఖముల్ పృథుమృదంగములు
భూరిఘోషమ్ముల భోరున మొరయ
నుదయార్క సంకాశ మొక రథంబెక్కి
పదిలుండై యేతెంచి బలముల తోన
వానర సేనలవడి గూల్చుచుండ
దానరుట్ గారగ వాయునందనుఁడు
కాలాగ్నిరుద్రుఁడై గదిమివాఁడేయు
బాణములను ద్రుంచి పడిగొల్పి రథము
దూ సాన్ర వృక్షములతో నద్రిపై వైచి
ధూమ్రాక్షు శిరము నిర్ధూమంబు చేసె
నా వార్త విని రాక్షసాధిపు డలిగి
కావరంబుదనర నకంపను బిలిచి
దానికి పొమ్మన్న వాడరథంబు నెక్కి

ధనుజులతోఁడ నుద్ధతి నేఁగుదెంచి
కపి సైన్యముల సాయకముల నొప్పించి
విపరీతుఁడై రాగ వీక్షించి కపులు
తరులను గిరులను దనుజ సైన్యముల
పరువడి నొప్పింప పవన నందనుని
యా యకంపనుఁడు సూయ శరముల ముంప
వాయు పుత్రుండొక్క వర వృక్షమునను
కంపింప దనుజుల కంపను బట్టి
చంపు వానర సేన సన్నుతింపగను
పరులచే నకంపనుఁడు కూలుటయు
పరితాపమున విని పంక్తి కంధరుఁడు
నరుల వానరుల మిన్నక ద్రుంచు మనుచు
కరమర్థి నా మహాకాయుని బనుప
నా రాక్షసుండు శతాంగంబు నెక్కి
దారుణా కృతితోన దక్షిణ ద్వార
మునరాగ దైత్యులు మొనసి వానరుల
మొనలుదీరిన బల్లెముల గ్రుచ్చి గ్రుచ్చి
కరవాలముల నొంచి గదలచి సదచి
సురియలనాడించి శూలాల బొడిచి
పరిఘల విదిరించి పట్టె సప్రాస
శరపరంపరలేసి చక్రముల్ వైచి
కడువడి నొప్పింప కపులు కోపించి
విడువక నా దైత్య వీరపుంగవుల
మోకాళ్ళ పొడిచి నిమ్ముల పదల్గకరచి
తోకలను చుట్టి గొంతుల నురిబెట్టి

గదిమి గోళ్ళనుచించి రథకాళ్ళదంచి
గదిసిట్లు రాక్షసుల్ కపులు పోరాడ
సంగదుపైని మహాకాయుండవుడు
పొంగుచురాగ నప్పుడు పేర్చి యార్చి
వానర ప్రముఖులు వైచి శైలముల
వాని మంత్రులనెల్ల వధియించి రంత
అంగదునవుడు మహానాధుండె విరి
సంగతిగా మూడు శరముల నేయ
అతుల కోప స్ఫూర్తినంగదు డంత
ఆతని శతాంగంబునవనిపై కూల
పట్టి భూధరముపై పడవైచి కుమ్ము
మెట్టిగుద్దులురుకంగ మెదద్రుంచివైచి
తమ్ముడు కూలనుద్దండ కోపమున
నా మహాకాయుండయ్యంగదు పైని
తోలించి రథము తోడ్తాన బాణములు
కీలించి యంగదు కేరి యిట్లనియె
వోరి వానర వినకొని నీ మీద
నా రాచముల కొట్టనాయంటె తనదు
శివుని చాపము ద్రుంచి సీతచేకొన్న
యవనీశుడైగాని యమ్ముని విడువ
పరశురాముని భంగపరచిన యట్టి
హరి శౌర్యుపైగాని యమ్ము నే విడువ
వీరుడై యాఖరుని దలచినట్టి
యా రాజుపైగాని యమ్ము నే విడువ
యావాలి నొక కోలనని గూల్చినట్టి

యా పేరుపైగాని యమ్మునే విడువ
తూరివార్ధిని యందు సేతువు గట్టినట్టి
యా రామునిపైని యమ్మునే నిడువ
భుజబల స్ఫూర్తిని పొదలి లీలగను
రజతాద్రి యెత్తిన రావణుసుతుఁడ
తుది నేను యింద్రజిత్తునకు తమ్ముఁడను
యిదె మహాకాయుండ నే తెచ్చినాఁడ
నని బల్కి పేర్చు మహాకాయు జూచి
వసువడి సుత్రామ పౌత్రుఁడిట్లనియె
వోరి మహాకాయ వోరి దురాత్మ
యీరీతి బీరంబులేల నాడెదవు
మీ తండ్రి గిరియెత్తి మెరసె మాతండ్రి
మీతండ్రి నెత్తి నెమ్మిగ వార్ధిముంచె
నీలావు పొలియనే నిను ముంతుననుచు
వాలి నందనుండు దుర్వారుఁడై పేర్చి
పరఁగు రాక్షసునిపై పర్వతం బేసె
కరపరంపరల రాక్షసుండది గూల్చె
నారసి తేరుపై నంగదుండురికి
పోరి సారధితోన పొడిపొడిజేసె
దనుజుండంగదుఁడును తలపడి యపుడు
దనరుచు మల్లయుద్ధము సేయుచుండ
కరముల నురముల కాళ్లను వేళ్ల
సరి సరిపోరి రాక్షసు రొమ్ముద్రొక్కి
యడుగుల పడదన్ని యమ్మహాకాయు
మెడనుల్మి తలద్రెంచి మిన్నంటవైచె

హత శేషులంత మహాకాయు పాటు
వితతంబుగా విన్నవింప కోపించి
యా రావణుఁడు ప్రహస్తుని బిల్చి
యా రాముపైనంప నా ప్రహస్తుండు
రావణ వినుము శ్రీరాముని మీద
నీవు పొమ్మన్నను నే నిల్వరాదు
చనుపున బుద్ధులు సచివులు జెప్ప
వినవైతివికనైన విభుసీత రామ
జననాథునికి నిమ్ము సంధిగావింపు
మని జెప్పి పీడ్కొని యా మంత్రివరుఁడు
నతి జయప్రదమైన యరదంబు నెక్కి
చతురంగ బలముల సంఖ్యలు గొలువ
కాలాంతకుని రీతి కార్ముకంబంది
వాలమ్ము సంధించివచ్చిన జూచి
వనచరులెల్లను వడిబారుచుండ
జననాథుఁడా విభీషణుని కిట్లనియె
తేజంబు బలమును దీప్తశౌర్యంబు
రాజిల్లుచున్న యీ రాక్షసవరుని
పేరేమియన్న విభీషణుండనియె
నా రావణునికి వీఁడాప్తుండు దేవ
కలిగిన సైన్య సంఘములకు నెల్ల
దళవాయి యీతని దళములతోన
మూడవ పాలిందు మొనసియేతెంచె
వాఁడె వీరుఁడు రావణుని మాతులుండు
తపన కులేశ యీ దైత్యునితోన

కపినాధులకు లెస్స కయ్యంబు కలుఁగ
నని చెప్పుచుండఁగ నగచరులెల్ల
దనుజ సైన్యముల నుద్ధతి తాకితాకి
కొండలుపై వైచి ఘోయని యార్చి
చండ భూజమ్ముల చరియంగ మొత్తి
పొరపైన నఖముల నురములచించి
విరివిగా తోకల విసరి యాదగను
కపుల రాక్షసులు రాక్షసులను కపులు
కుపితులై పోరనెకొన్న కోపమున
ద్వివిదుండు కుధరంబు తెరగొప్పవైచి
అవిరళ శక్తిన కాంతకు గూల్చె
ననిలోన యశకుంభహనుమ కీటణచె
మునుగొని యొక వటంబున తారుఁదతిగి
వదలక గిరి జాంబవంతుండు బూని
యదరంట వైచి మహానాధునణచె
తరమి దుర్ముఖుండొక్క తరువెత్తి దివిజు
లరువొంద వధియించె నా సమున్నతుని
తనమంత్రు లిటువలె ధరణిపైబడిన
కనలి ప్రహస్తుండు కాలాగ్నిమాడ్కి
దాక్కొక్క శరమున నొకలక్ష కోటి
తక్కిన కపుల విదారించి వైవ
నిలునిలుమని వచ్చి నీలుఁడావేళ
చలమున నొక్క వృక్షము పెల్లగించి
తెరలి ప్రహస్తుని తేరుపై దాకి
హూరాట సౌరదినెత్తి యదరంట మొత్తి

యదరించి యార్చిన యా ప్రహస్తుండు
గదగౌని సీలు సక్షంబున బొడిచె
బొడిచిన మూర్చిల్లి భూమిపైవాలి
తడయక తెలిసి యుద్ధతి నీలుఁడంత
బొదవైన యొక మహా భూధరంబెత్తి
తొడబడి యా ప్రహస్తునిమీద వైచె
వైచిన నెత్తురుల్ వాత గ్రమ్మగను
కొంచకూ తలు గూసి కూలె భూస్థలిని
నీలుండ వ్వడు రాఘవునికి మ్రొక్కి
నాలింగనము జేసె సతని రాఘవుఁడు
చెదిరిన రాక్షససుత శ్రీసుంబులోయి
తుదిముట్టి యా ప్రహస్తుని పాటుచెప్ప
వెరచి మంత్రులజూచి వెరవొప్ప బలికె
గరిగౌని తలపులు కొనసాగదయ్యె
దూరమున కేగు దైత్యుఁడొక్కడైన
మరలిరాడిది యేమి మాయయో యెరుగ
నీచ వానరులట్లు నిఖిల దానవుల
నేచినప్పుడె జూచ యిది కాలకీడు
తొడబడి యొకపని తొడగంగరాదు
తొడిగి పిడిన బహు దుష్కీర్తి గాన
చని నేను రామలక్ష్మణుల వానరుల
ననిలోన వధియించి యవనిజతోన
ననుభవింతును సౌఖ్యమనుమానమేల
ఘన చాపసాయక కలితమౌ రథము
తెరగొప్ప తెమ్మన్న తెచ్చిరంతటను

సురులు గంధర్వులు జూచి భీతిల్ల
దశముఖుంతప్పుడు తన రథంబెక్కి
విశదంబుగా పది విండ్లు చేబూని
పటుతర నిస్సాణ ఢాంకారములును
పటహ భేరీ శంఖ భయద ఘోషములు
హస్తిబృంహితములు నశ్వఘోషలును
ప్రస్తుత పాదక ప్రకర నాదములు
కమనీయ రథనేమి ఘర్ఘర ధ్వనులు
సమితంబులగుచు బ్రహ్మాండములునింప
తన రనయుండు రామ ధరణీశుజేరె
తనమీద దండెత్తి తరలి నాదనుచు
పనుపడి దాగిన పగటి కెందూళి
కనుబడదాయను కమల బాంధవుడు
వికృత రూపంబులు వికృత నేత్రములు
వికృత వక్త్రంబులు వికృత గాత్రములు
కలిగి భీకరులు రాక్షసులేగుదేర
జలధులు కలఁగ దిక్చక్రంబు పగల
తదయక సప్పుడుత్తర వాకిటను
వెడలిన రాక్షస విభుని వీక్షించి
భావించి భావించి పలుమారు మెచ్చి
యా విభీషణునితోన ననియె రాఘవుడు
యీ వచ్చు వాడెవ్వడీ యోధుడెవ్వడు
నను విభీషణుండా రామునకనియె
మనుజేశ వినుమహా మదగజంబునను
గానకొని యెక్కి యంకుశము చేబూని

ఘనమైన నవరత్న కంకణములు దనర
కొమరైన ముత్యాల గొడుగులనీడ
కమల బాంధవు రీతి కాంతి వహించి
గరిమెతో దైత్య సంగతి వచ్చునాత
డురుశక్తి గలిగిన యురు పెనుండధిప
పీరుఁడై రథముపై విలసిల్లువాఁడు
దారుణాకృతి మహోదరుఁడు శ్రీరామ
ఘనమైన సిత ఘోటకంబుపై నెక్కి
చనుదెంచువాఁడు పిశాచ నాథుండు
వసువడి సింహంబుపై వచ్చువాఁడు
దినకర కులనాథ త్రిశిరవన్వాఁడు
చలమున కాంచనోజ్వల రథం బెక్కి
తలకొని విలుగుణ ధ్వనులు సేయుచును
దొరసిన సర్పకేతువు గలవాఁడు
గురుర్భంగు బలశాలి కుంభుండుదేవ
అతని వెంబడి విశాలాంగంబు నెక్కి
ప్రతిలేని హేమ ధాపము చేతబూని
యరిమురి చనుదెంచు నా రాక్షసుండు
గురుశైలనిభుఁడు నికుంభుండు దేవ
కనక రథంబెక్కి కపులపై పగుల
కణలుచు మణి కార్ముకంబుచే బూని
యనిసేయ సన్నద్ధుఁడై వచ్చు దైత్యుఁ
డనుపమ బలుఁడు నరాంతకుండధిప
భీషణాకారుఁడై పేర్చి వాక్యములు
ఘోషించి లయకాల రుద్రుని మాడ్కి

కరముగ్రులైన రాక్షసులు కొల్వగను
పరుదెంచువాఁడు దేవాంతకుండధిప
ఘనమైన ఘోషంబు కలపైడి రథము
దనరార నెక్కి యుద్ధండుఁడై చేర్చి
యరుణాంబరమ్ముల నరుణమాల్యముల
నరుణ గంధమ్ములన నలరి కోపించి
సంధ్యాంబుదచ్ఛాయ చనుదెంచువాఁడు
వింధ్యాచలముబోలె విలసిల్లువాఁడు
శూరుఁడై మనల బూచుచు వచ్చునాతఁ
డా రావణుని సుతుండతి కాయుండధిప
భూరిసితచ్ఛత్రములు పదివేలు
చారు చామీకర చామరావళులు
వెలయ రథంబెక్కి విలుచేతఁబూని
కలిత శస్త్రాస్త్రనికాయుఁడై పేర్చి
సురపతి చెరబట్టి సొంపారినట్టి
వర గర్వమున వచ్చు వాఁడింద్రజిత్తు
పసిడి కొండల చేత బాసిల్లిరుచుల
మసలుచునున్న చామరములు వీవ
ఒక భానువుల మాడ్కి దశ కిరీటములు
దశ శిరంబుల యందు దనరారు చుండ
రోషమహాదృష్టి రోచుల మిసుల
భీషణా కారుఁడై పేర్చినవాఁడు
దనరుకైరావత దంత ముద్రికల
మొనసిన పెను వక్షమున నొప్పువాఁడు
హరునితో కైలాస మగలించినాఁడు

సరిలేని చంద్రహాసము గొన్నవాఁడు
త్రిజగముల్ నీటిల త్రిదశుల గెల్చి
భుజబల స్ఫూర్తుల పొదలిన వాఁడు
మొనసి సేనామధ్యమున వచ్చువాఁడు
వనజాప్త హితవంశ వాఁడు రావణుఁడు
అనుచు విభీషణుండాడు వాక్యములు
విని రామచంద్రుండు విస్మయం బంది
యిట్టి తేజమ్ముల నిట్టి ధైర్యమ్ముల
నిట్టి వైభవముల నిట్టి సంపదల
గట్టిగా జూడ రాక్షస కులంబునను
పుట్టరొక్కడు వీఁడు పుట్టె వింతగను
క్రూర కర్మముల గైకొనకుండెనేని
యీరెండు జగముల కీశుఁడు పూజ్యుండు
వాలిన భుజశక్తి వడిలేని భటులు
కాలరుద్రునినైన గచుముదు రనుచు
నాగ్రహంబున రాముండా దశగ్రీవ
నిగ్రహక్రమ కళానిపుణుండై పేర్చి
యనికి సన్నద్ధుఁడై యనుజన్ము చేతి
ధనువందుకొని గుణధ్వని సేయుచుండె
అప్పుడు రావణుండసుర యోధులను
తప్పక జూచి రాతగడు నావెంట
వచ్చిరేని యీ వనచరుల్ కోట
జొచ్చిన మనలావు చొప్పడదపుడు
కావున లంకకు కదంగి పొమ్మనుండు
వేవేగ రాక్షస వీరులు జనిరి

దళముఖుండంతట ధనువుచే బూని
దశదిశల దరనుద్ధతిని పేర్చుచును
కరకు బాణముల పుంఖాను పుంఖముగ
ధరువడి వనచర బలముపైనేయ
నాశిలీ ముఖముల సంగముల్ నాగిలి
కీశులు భయమంది కీచు కీచనుచు
పోరి లోవలబడి పొరలు వానరులు
పారు వానరులును భ్రమయు వానరులు
కూలు వానరులును క్రుంగు వానరులు
వ్రాలు వానరులును వనరు వానరులు
కలిగి సంగరము భీకరమైన జూచి
బలదివ ప్రముఖులు భయమందిరపుడు
సుగ్రీవుడంతట శూరత మెరసి
యాగ్రహంబున భీకరాద్రిని వైచె
వైచిన కనలి రావణుఁడు శైలమున
చూచి బాణమ్ముల చూర్ణంబు జేసి
దండధరోద్దండ దండంబు బోలు
కాండంబువింట నొక్కటను సంధించి
వాలిన శక్తియై వక్షంబు నేయ
నాలోన సుగ్రీవుడవనిపై బడియె
భుజబలాడ్యుఁడు ఋషభుఁడు సురంప్తుఁడు
గజుఁడు గవాక్షుండు గవయుండు నలుఁడు
జ్యోతిర్ముఖాదులు జూచి కోపమున
నాతత వృక్ష శైలాదులనేయ
నవి ద్రుంచి రావణుండమిత బాణముల

నవనిపై పడవైచె నా యేడుగురుని
వాయుజుండపుడు రావణు తేరుపైని
పోయక చుమికి కోపమున నిట్లనియె
ఓరీ రావణ వినరోరి మూఢాత్మ
యీరేడు జగముల ఇంద్రాది సురుల
క్రౌర్యంబును విడక క్రుళ్ళించుచిరు
త్రుళ్ళనంటే చోటు తొలగించె ననిన
వీక్షించి రాక్షస విభుఁడాంజనేయు
వక్షంబు బొడిచినవణకి వాయుజుండు
వడిచేర్చి రావిణువక్షమ్ము నపుడు
పిడుగుతో సరియైన పిడికిట బొడవ
పడి మూర్ఛజెంది వెంబడి మూర్ఛదెలసి
అదరురు రావణుండనిలజు జూచి
నీలావు కొండాడ నేనెంతవాడ
మేలు పావని నిన్ను మెచ్చితిననిన
రావణ నాలావు రహినెక్క గలదె
నీవు ప్రాణములతో నిలిచిన యపుడె
యన విని రావణుండలిగి వాయుజుని
పెనుపొందు వృక్షంబు పిడికిట పొడిచె
పొడిచిన మూర్ఛిల్లి పొలుపెల్ల పొలిసి
పడియె వాయుజుడంత పంక్తికంధరుఁడు
నీలుపై కవిసిన నీలుండు పేర్చి
శైల శృంగముల వృక్షంబులనేయ
తెలిసి మారుతి నీలుదెస రావణుండు
కళహింప జూచి యక్కర పోకయుండె

మనుజాశనునిమీద మలయ శృంగంబు
గొనివైచె నీలుండు కోపించి పేర్చి
ఘనిమై రావణుండది తొదరి బాణముల
కని నీలుఁడప్పుడు కరలాఘవమున
దనుజాలు కమగొని తల్లడంబంద
దనుజేశు రథముపై తద్ధయు నుఱికి
పొడిజేసి కేతనమ్ముల చామరముల
విడువక చాపంబు విరిచి పోవైచి
యొక మోళిపైయుంచి యొక మౌళిపైనుండి
యొక మౌళివ్రేసి యొక మౌళిజూచి
పెనచి హారంబులు పెరికి పోవైచి
దనరగ సింహనాదముసేయ జూచి
కనలి రావణుడగ్ని కాండంబు తొడిగి
యనల పుత్రునికేయ నతడంత బడియె
సౌమిత్రి యంతట చాపంబు బూని
త్రిధనువంది చనుదేర జూచి
యా మహారాక్షసుండనియె నవ్వుచును
దక్కగా లక్ష్మణ చాపంబు చేబూని
యెక్కుబెట్టగ నేరవింక బాలుఁడవు
వలనొప్పనని సేయ వచ్చితివేని
బలియిత్తునిను భూతపంక్తుల కనిన
వలదిట్టిమాట రావణబంటవై తె
నిలిచి పోరాడుము నీలాపుజావు
మన పంక్తిముఖుఁడు రామానుజు మీద
సుని శిలాస్త్రంబులు సోనలై కురియ

నరుఁడు కోపించి దశాస్యు బాణముల
ప్రతి బాణములనేసి ఖగ్నంబు జేసి
విలుద్రుంప రాక్షస విభుఁడు కోపించి
చలమున నలబ్రహ్మశక్తి వైచినను
వలగొని కాలాగ్నివలెవచ్చి శక్తి
కలయ నాటినను లక్ష్మణుడట్టె బడియె
నరసిదశాననుండంత లక్ష్మణుని
నిరువది చేతులనెత్త బోయినను
నాతఁడు నారాయణాంశంబు గాన
నే తెరంగున వానికెత్తరాదయ్యె
పూనితి కైలాస భూధరం బేను
నానాటి బలమెందు నణగె నేడనుచు
భీమహాస్త్రంబుల పెనచి రావణుఁడు
సౌమిత్రి నెత్తెడి చందంబు జూచి
యరిమురి కోపించి యాంజనేయుండు
కరకు రాక్షసుని వక్షస్థలి పగుల
పొడిచినంతన మూర్ఛపొంది రావణుడు
కడుదూలి నెత్తురుల్ గ్రక్కి బోరగిల
పడియె పిరుందను పరమిడలేక
పడిన రావణుని దుర్బలము నీక్షించి
పావనియును విష్ణు భక్తుడుగాన
రావణునకు నెత్తరాని లక్ష్మణుని
చేరుకొని యవలీల కొని వచ్చిరామ
జనవాథు ముందర సరగున నుంచె
నట రాక్షసేశ్వరుండమ్మూర్ఛ దెలిసి

చటుల బాహాశరాస నస్సుద్ధవయ్యె
ననుజు పాటున జూచి యా రాఘవుండు
కనలి రావణు మీద కరమర్దిననిస
అనిల తనూభవుండనియె రామునకు
యిన కులాధీశ్వర యీ దశగ్రీవు
చరదంబుపై నుండి యాలంబు సేయ
గరిమెగాదిది నీవు కాల్నడన చనియె
రావణు శక్తి సౌమిత్రి తాసి
మొనసి లక్షణుదంట మూర్ఛతెప్పిల్లె పంక్తిరు
వనసపుడు సంప్రీతి హనుమంతు నెక్కి
యనిమిష కరిమీది యమరేంద్రుఁడసగ
నొప్పి గుణధ్వని నొయ్యననేయ
యప్పరు కోపించి యసుర వల్లభుఁడు
భీమాహులను బోలిపేర్చు బాణముల
రాముపై నేసిన రాముండు కనలి
దక్కగా వెనసర్ధచంద్ర బాణమున
రక్కసు విల్లుద్రుంచి రయమున వాని
మర్మముల్ నొప్పింప మసలక నొక్క
ధర్మంబు గొనియార్చి దశకంధరుండు
పటు బాణ మొక్కట పవన నందనుని
నిటలంబు నేసిన నెత్తురుల్ పొడమె
చూచి యా రాముండు హాలి చందమున
యేచి కోపానలంబెసగ కన్నులను
కల్లెంబు బొడిగె యా పంక్తి కంఠరుని
వీల్లంత లోపల. విరుగంగ జేసి

యుక్కట సారథి నొకటనశ్వముల
నొక్కట నరథంబు నొకట పతాకఁ
నొక్కట గొడుగుల నొకట వస్త్రముల
గ్రక్కుననేసి చూర్ణములుగా జేసి
పది శిరంబులవాని పంక్తికంధరుని
పది కిరీటంబులు పడడొల్లనేయ
ననికి నిశ్చేష్టుఁడై నొదల దాల్చి
దనుజేశ్వరుడుండ తగ రాముఁడనియె
కపులతో పోరాడి గాసిల్లినావు
కపట రాక్షస నిన్ను కదతెర్చరాచు
నీవు లంకకు వేగనేడు బొమ్మనిన
రావణుం దప్పుడు రాము మెచ్చుచును
కరతెల్లనుడిగి యొక్కరుఁడుగా బోయి
పరగ యా లంకలోపల జొచ్చెనంత
నీరీతి లంకకు నేగి రావణుండు
శ్రీరాము శౌర్యంబు చింతించి వగచి
తన మంత్రులను దిల్చి తగనిట్లులనియె
తన గర్వబలము లంతయు రాముడణచె
ననిలోన నా ప్రహస్తాదులు జనిరి
ఘనవంశ గెల్వనింకెవ్వఁడున్నాడు
ఘన బలుండగు కుంభకర్ణుండు దక్క
తను దానె మేల్కాంచి తగవిభీషణుతో
నలరి యేతెంచి మంత్రాలోచనంబు
పొలుపారగా జేసి బోయి క్రమ్మరను
నేడు తొమ్మిది నాళ్లు నిద్రయ్యె నున్న

వాడు శత్రువులనెల్ల వధియింపగలడు
తడయక మీరలాతని మేలుగొలిపి
విడువక లెమ్మన్న విని దైత్యవరులు
తరలి వారపుడు నిద్రాగుహ జొచ్చి
నిరివిగా నటు హేమవేదిక మీద
పుడుగని బెట్టూర్పు లుప్పతిల్లంగ
కడు నిద్రగాను కుంభకర్ణుని జూచి
యురువడి శంఖంబులూదియు బెట్టు
మెరయంగ నిస్సాణములు చుందుభులును
జెంది వ్రేసియు తోన సింహనాదములు
సందంద చెలఁగింప నా మహారవము
ఘూనభోంతరములు పాలుపొందనింద
దానవుడందు సల తగమేలుకొనక
నిచురబోవగ జూచి నిఖిల రాక్షసులు
గదలును ముసలముల్ ఘనముగ్గరములు
పదివేల కుంతముల్ పైని వైచుచును
వదలక కొండలు వైచి యార్చుచును
యురముపై మెట్టుచు నొగి వృక్షములను
శిరము తాటింపుచు సింధురంబులను
పోతుల మేకల పులుల దుప్పులను
టాతిగా ఖరములపైని మెప్పించి
క్రొటది మీరిన నూనెకుండలు కాది
పలుమారు చెవులలోపల పోసిపోసి
ప్రాకటంబుగ గడ్డపారల గాల్చి
నీకర నాసికా బిలముల బెట్టి

రక్కసులారీతి రాయడి సేయ
నొక్కంత మేల్కొని హుమ్మని నిలిగి
బడబాముఖాభమై పరగిన నోరు
తడయక తెరచి వింతగ నావులించి
శ్రీరాముచే ముక్తి చేకొన కోరి
దూరంబుగా నిద్ర తోసిన మాడ్కి
ప్రళయ కాలాగ్ని బింబంబుల బోలు
కలయంగ నెఱ్ఱని కన్నులతోన
కనువిచ్చి యసురులు కంపింపమేలు
కని కుంభకర్ణుండుగ్రతను కూర్చుండి
అనుపమంబైనట్టి యాహారకాంక్ష
తనయొద్ది రాక్షసతతిజూడ వారు
నిరవొందగా నప్పుడిరువది యొక్క-
పురుషుల మాంసంబు ప్రోవుగా బోసి
యెనబది వల భాషంబులెనచు నూరజముగ
లును వేయు క్రోదంబులును నాల్గువేలు
ఘన శశంబులును మృగంబులార్నూరు
ననువొందగా దెచ్చి యవి వేరువేర
దంపి సుపక్వమాంసంబులు మిగుల
నింపార నాతని యెదుట బోయటయు
తనివారమెసవి యుద్ధతి రెండువేలు
ఘన ఘటంబులలోన కలమధ్యమాని
పటపట దిక్కులు పగలద్రెల్లుచును
కటుకంటులైన మీసములు దీర్చుచును
తనమున్ను నిలిచిన దానవ శక్తి

కనుగొనీ యా కుంభకర్ణు డిట్లనీయె
మీరు నన్నేటికి మేలు కొల్పితిరి
వారక రాక్షసేశ్వరునకు శుభమె
యనిన యురూపాక్షుడు హస్తముల్ మొగిచి
వినుదేవ రాక్షస విభుండు శ్రీరాము
రమణి నెత్తుకురాగ రామలక్ష్మణులు
సమర భీకర కపి సైన్యముల్ గొలువ
వనధి బంధించి వడిలంక జొచ్చి
యనిలోన యా ప్రహస్తాదుల కూల్చి
నిన్న మీయన్నను నెరయ నోడించి
యున్నారు గావున నులికి రావణుఁడు
నినుతోడి తెమ్మనె నీవు విచ్చేయు
మన కుంభకర్ణు డిట్లనియె వానికిని
నరుల వానరుల రణంబున గూల్చి
మరలి నేవచ్చెద మాయన్నకడకు
ననిన మహోదరుండనియె కేల్మోడ్చి
వినుదేవ రాక్షస విభునిచే నీవు
పనులెల్లవిని బోయి పగతుల గెల్వ
మనిన యట్లేగాక యని కుంభకర్ణుఁ
డనుకూలమయ్యె నాచేత బూని
తనులను కోపాగ్ని కణములు చెదర
కరమర్థి తనపాద ఘట్టనంబునను
ధరధులు కలఁగ దిక్చక్రమల్లాడ
బాటంబులో వచ్చువాని రూపంబు
కోట యవ్వలి కపి కోటులు జూచి

వరచి దిక్కులను వాపిరి పారుచుంత
పరువడి కొందరు శ్రమసి మూర్ఛిల్ల
తమ్మునిచేసున్న ఘనపు చేటాని
యమ్మహీశుఁడు రామజానుజా కనియె
యీవచ్చు రాక్షసుండెవఁడు లోకముల
నాపటంచును రూపసత్వంత భయద
మనిన విభీషణుండా రాముఁజూచి
వినుదేవ దెల్పెద వీని చందంబు
వడిగలవాఁడు రావణు సహోదరుఁడు
కడు క్రూరమతి కుంభకర్ణుఁడనువాఁడు
పుట్టినప్పుడె వీఁడు భువనంబులెల్ల
పట్టింపఁగ పద్మజుండలిగి
నీవు సతతమును నిదురబొమ్మనుచు
చావుతో సరియైన శాపంబొసంగి
రావణుండప్పుడు రాజీవభవుని
వావిరి ప్రార్థింప వనజుండప్పు
డక్కజంబుగను వీఁడారెడు నెలల
కొక్కొక్క దినము మేల్కొని యుండుననియె
నానాటి మొదలు నిద్రాసక్తుండగుచు
దానవుడుండును దశముఖుండపుడు
దేవరచే నోడి దిక్కుఁదప్పోయి
వేవేగ పిలిపింపఁడు మేల్కొంచి
దేవారి నగరి కేతెంచుచున్నాఁడు
భావించి కపులెల్ల భయపడకుండ
నసురగాదొకదాను యంత్రంబటంచు

పనను చాటించిన పెరపెప్పుడేవ
యనవుడు నిలువ కానతియిచ్చి
ఆననాదుడిభ్భంగి చాటంగ బనిచె
గరిమె నంతట కుంభకర్ణుండు నగరి
కరుదెంచి సాష్టాంగమన్నకు మ్రొక్కి
మగరాల పీఠిని వలసి కూర్చుండి
నగధీర రావణ నిన్ను మేల్కొలుప
కారణంబేమి చక్కగ దెల్పుమనిన

—:కుంభకర్ణుని బుద్ధి:—

నారాక్షసేశ్వరుండను జన్మ జూచి
వనచర సేనతోవచ్చి రాఘవుండు
వననిధి దాటించి వడిలంక జూచి
యనికోసం మా ప్రహస్తాది వీరులను
దునిమె నీవిప్పుడు దోర్బల శక్తి
తరుచరావళిలోన దశరథాత్మజుల
వరిమార్చి యీలంక పాలింపుమనిన
విని కుంభకర్ణుండు విభుదారి కనియె
మును రాము భార్యను ముచ్చిలి నీవు
తెచ్చినప్పుడె కీడుదెచ్చితివధిప
యిచ్చట పునరుక్తులేటికి నికను
తుద మొదలెరుఁగక దుర్మదంబునను
రదరిలసౌమ్యుడు కార్యభాగంబు సేయు
బాఁడాపదల పొందు బాతందులిందు
వాఁదనేల రావణ నీవెనుమ్మి
మతిగల వారల మంత్రాను మతుల
కృత కార్యములు బరికించునే విభుఁడు

నేగి ప్రభుమంత్ర సమతోత్సాహ శక్తు
లగణిత ఫలదంతంబులై వాని కమరు
పతి దేశకాల విభాగంబు లెరిఁగి
చతుర జనభృత్య సంపద గలిగి
శౌర్యంబు మీఁదగు కార్యమూహించి
కార్య విఘ్నప్రతీకారంబు దెలిసి
ఫలసిద్ధికైకేని బహు రాజ్యఁభోగ
ములనిత్యుఁడై యుర్విమోదింపవలయు
పగవాని భుజశక్తి భావించి సంధి
తగు బుద్ధియై జేయ తలపోయవలయు
రూపింప సమబల రూఢిని తోడ
నేర్పుతోడుత నిగ్రహింపంగవలయు
నటుగాక బలహీనుఁడగుట చింతించి
పటు సత్వుఁడై శత్రుపై నెత్తవలయు
విడిసిన బలము వివేకించిమీఁద
విడిసి మార్తురగెల్వ వెరహొందవలయు
వైరుల సాధ్యులై ప్రాలిన వారి
తో రెండు పుట్ట ప్రలోభింప వలయు
నతి సత్వులై వైరుల జితులై రేని
హితబుద్ధియై నాశ్రయింపంగ వలయు
నీయారు గుణముల నెరిగి వర్తించు
నా యవనీపాలుఁడభివృద్ధి బొందు
పూని యేవురు మందెప్పుడు సామభేద
దాన దండములు చితము దప్పజేయు
నెఱయ వానికిగల నీతి శాస్త్రములు

కొరవాలియుండు నిక్కువ మివ్విధంబు
పరసతి పరధన పరచిత్తు(డెవ్వ(
ధరయు నాత(డు కులమంతయు జెరుచు
నని కుంభకర్ణు(డిట్లాడు వాక్యములు
విని రావణుడు క్రోధవివశు(డై బలికె
దావిరి నను వెర్రివానిగా జేసి
నీవు శిక్షింపకు నిదురింప బొమ్మ
నిదుర బొయ్యెదవేని సిద్ధింపరొరులు
కుదురుగా రక్షించు కొమ్ము ప్రాణముల
ననిన రావణు జూచి యా కుంభకర్ణు(
డనిమొ నాతని ముఖం బంతయు దెలిసి
నావంటి తమ్ముడున్నత శక్తినుండ
రావణ నీకేల రణ విచారంబు
లుపమింపరాని నాయుగ్ర శూలమున
కపుల రాఘవులను బంధించి వత్తు
నని యన్నకును మ్రొక్కి యా కుంభకర్ణు(
డనికి సన్నద్ధు(డై యార్చుచు లేచి
శూలి శూలము బోలు శూలంబు బూని
శూల రుద్రునిమాడ్కి గర్జించుకొనుచు
తనుజేరి దైత్యులుదగ్రులై గొలువ
కనుగొని దివిజులు కంపింపు చుండ
ధరణి వీలులు బాయ ధరములుదుల్ల
శరధులు కలంగ దిక్చక్రముల్ పగుల
జనియింపరాని దుశ్శకునముల్ పొడమ
ధని లెక్కగొనక లంకాపురి వెడలి

కడిమి వచ్చిన కుంభకర్ణుని జూచి
జడిసి యా వానర సైన్యంబు లెల్ల
చెదరి దిక్కులబారి చెట్లలో దూరి
వదలక మూర్ఛిల్లి వడిగ తెప్పిల్లి
ఘనశైల వృక్షముల్ కరముల బూని
దనుజ సైన్యములపై ఢట్టించి దేవ
పడెడు రథంబులు భ్రమయు యోధులును
జడియు సారథులును సమయ గుఱ్ఱములు
త్రెళ్ళెడి గజములు తెగిపడువిండ్లు
మల్లాడు శూరులు మూర్కొను కపులు
కలిగి భీకరమైన కదనంబు జూచి
తలకుచు దైత్యులు తన వెన్కబడిన
కని కుంభకర్ణుడు కపి సైన్యములను
ఘనమైన తోకలు కాళ్లను బట్టి
ధరణి వైచియు కాళ్ళదన్ని గూల్చగను
హరులు పారగ జూచి యంగదుండనియె
కపులార మీరిట్లు కదన రంగమున
విపరీత బుద్ధులై వెసపారతగవె
గక్కున మగుడుడు ఘనతతో యనిన
నక్కజంబుగ కపులద్రి వృక్షములు
నా కుంభకర్ణుపై నందంద నేయ
తోకతోనవియెల్ల చూర్ణంబు జేసి
కుతలంబు దద్దిల్ల కుంభకర్ణుండు
మితిలేని కపులను మ్రింగె మింగుటయు
కపులెల్ల వెరలిరి కర్ణ రంధ్రములు

కుపితుఁడై యార్చుచు కుంభకర్ణుండు
గదగొని వేసిన గద కిందనపుడు
సటకుడమైరి యసంఖ్య వానరులు
పవమాన నందన ప్రముఖులాలోన
వివిధ పర్వతములు వృక్షంబులేయ
శూలంబుచే దాని చూర్ణంబు జేసి
వాలిన నిటశక్తి బాయుజు సడచె
నీవారు పిరసకను వనచరాధిపుల
గావిందు నా కుంభకర్ణుని జూచి
సుగ్రీవుడప్పుడు శూరత మెరసి
యాగ్రహంబున నొక్క యచలంబుపైవ
పడి కుంభకర్ణుని వక్షంబు దాకి
పొడిపొడియైరాలె భూధరం బపుడు
కాలాగ్నివలె కుంభకర్ణుఁడు పేర్చి
శూలి శూలములోలు శూలంబులైన
నదిరాఁగ కనుగొని హనుమంతుడెగసి
తుదముట్టను దాని తునియలు జేసె
శూలంబు విరిగిన జూచి రాక్షసుఁడు
చే లీల మలయాద్రి శృంగంబు పెరికి
గురిగొని రవిజుపై కోపించియాయ
నొరలుదు సుగ్రీవుఁడుర్విపై లదియె
సచ్చట పడియున్న యర్క నందనుని
గుచ్చి చేతులనెత్తి కుంభకర్ణుండు
లంక లోపల రాగ లలనాజనంబు
సొక్కగా నతనిపై పూవులుజల్ల

తెలిసి సుగ్రీవుండు దిక్కులు జూచి
వెలవెలనై కడు వెరగున గుద్ది
యిటు పట్టుబడితినే యీ దైత్యుచేత
పటుతరమూర్ఛచే బడియింత దడవు
నని తన కరముల నాదైత్యు చెవులు
బెనచి తమ్మెలతోడ పెరికిరా దిగిచి
బొటములుతోముక్కు బోసివోగరచి
పటుగతి మీదికి భానుజుండెగయ
నిమ్ముల బోనీక యేచి రాక్షసుడు
క్రమ్మర నాతని కదగాన్కు బట్టి
నేలతో వేసిన నెగసి సుగ్రీవుం
డేలినపతి కడకేగె నయ్యెడను
తన ముక్కు చెవులునుద్దతి బోవజూచి
కనలుచు నా కుంభకర్ణుండు మగుడి
తరుచరావళులను ధట్టించి పట్టి
మొరయంగ జలధిని ముంచె కొందరిని
వెస లంకలోపల విసరె కొందరిని
విసువక నెమ్ములు విరిచె కొందరిని
హుంకించి యిట్లు వాడుగ్రుడై యార్వ
శంకించి వనచర సైన్యంబు కలంగ
ఘన బాహుబలుడు లక్ష్మణుడు కోపించి
చనుమర నాటించె శరములేడింట
మరల పెక్కింట లక్ష్మణదేవుండేయ
కరకు రాక్షసుడు లక్ష్మణుని గైకొనక
కదంగి యేతెంచు రాక్షసు వీక్షించి

కడు విస్మయంబంది కాకుత్స్థకులుఁడు
శరచాపములు బూని చనుదేరఁజేత
ముద్గరునై గడగొని ముందర నడచు
నా విభీషణు జూచి యా కుంభకర్ణుఁ
డావేళ సంప్రీతినని యె నీతిగను
మన వంశ మెల్లను మన్నించి బ్రోవు
మనువంశ తిలకుని మనసు రానడువు
నిలువక నా మున్ను నీవు పొమ్మన్న
నల విభీషణుఁడు దుఃఖాక్రాంతుడగుచు
తొలఁగె కన్నుల నీరు తొలుకుచుండగను
బలశాలి యగు రామభద్రుఁడావేళ
గారించు నా కుంభకర్ణుని జూచి
వోరి రాక్షసమాయ నొకట బన్నకుము
శూరుండవై తేని శూరత జూపు
పన్నగ సురసిద్ధ పతులు గాచినను
నిన్ను బోనియ్యను నిను నేడు ద్రుంతు
నన విని రాముని కనియె రాక్షసుఁడు
వినురామ నీవొక్క విప్రుని లేడి
తలలేనివాని వృద్ధగు మర్కటమున
పొలియించి మదిలోన పొంగుచున్నావు
నే కుంభకర్ణుండ నిర్జరాంతకుఁడ
నీకు నాముందర నిలువ శక్యంబె
యన విని రఘురాముఁడలిగి వేగమున
ఘన సాయకమ్ముల కడువడినేయ
పరువడి నాబాణ షంక్తులు గ్రోలి

కరముగ్రమైన ముద్గర ద్రిప్పుచును
నెదురుగా చనుదెంచు నింద్రారి జూచి
మది లెక్క చేయక మానవేశ్వరుఁడు
కవిసి యుద్భటగదా కలిత హస్తంబు
నవలీల బడనేసె యాయ బాణమున
నున్నదాపగిది చేత నొక పెద్ద వృక్ష
మున్నర భోజముండవలీల నెరికి
ఇంద్రాదు లదరంగ నేతేరరాముఁ
డైంద్ర బాణమున నా హస్తంబు ద్రుంచె
చేతులు ముక్కును చెవులును లేక
యాతతంబుగ వికృతాకారుఁడగుచు
నరుగుదెంచుచునున్న యా కుంభకర్ణు
సురవైరి గనుగొని యుర్వీశ్వరుండు
దురమున ద్రుంచె తోడ్తోన రాక్షసుని
చరణ యుగ్మము నర్ధ చంద్రబాణముల
నా రాక్షసుని వక్షమును వొంద జూచి
యా రామచంద్రుఁడైంద్రాస్త్రంబు నేసి
దసరారనంత నంతక శరంబేసి
దనుజ నాథుని గొప్పతల ద్రుంచివై చె
యా మస్తకముటోయి యబ్ధిలో బడియె
భీమ రాక్షసులెల్ల భీతి జెందగను
సప్పుడానందించి రఖిల గీర్వాణు
లప్పుడానందించిరఖిల వానరులు
చిరునవ్వు తళుకొత్త శ్రీరాముఁడపుడు
సళసత్త విలసిల్లె జయలక్ష్మితోన

ఘనుఁడైన యా కుంభకర్ణుండు పడుట
విని రావణుఁడు శోకవివశుఁడై యవుడు
కడిమియై నైయ్యతి కాయుని జూచి
వడి రామ లక్ష్మణ వనచరావనుల
యనిలోన గూల్చి రమ్మనిన వాఁడవుడు
రన తండ్రికిని మొక్కి తనరథం బెక్కి
దనుజులతో మహోదర మహాపార్శ్వు
డిలనుపమ బలశాలియగు త్రిశిరుఁడు
కనక రథంబుల కడకతో నెక్కి
తనవెంట రాగను త్రత శక్తిమీరి
శరచాప ఖడ్గాది శస్త్రాస్త్ర సమితి
శరమొప్ప సూర్య ప్రకాశమై దనర
దీపిత గవచాల్పి దేవాంతకుఁడు
రూపింప రుద్రుని రూపున వెడలె
అంతనాకృతి నినరాంత కుండపుడు
కుంతంబు చేబూని కుపితుడై నడువ
దిషారవంబుల నెల్ల దిక్కులను
ఘోషింప సేయుచు గుర్రముల్ నడువ
కొండల రీతినెక్కొన్న కోపమున
దండల బెడి వేతండముల్ నడువ
కాల కింకర సమాకారంబులైన
కాలు బలంబులుగ్రతమున్న నడువ
పటాహ భేరీ శంఖఠయఠ నాదముల
పటుతరనిస్సాణ ఖాంకారములను
దిక్కులు ఘూర్ణిల్ల దివి పెల్లగిల్ల

చిక్కులు దుల్ల వానికి తల్లడిల్ల
వచ్చి యా యగ్గురు వనచర సేన
తొచ్చి బాణంబుల సోనల్లి గురియ
తరుచరులప్పుడుద్ధత శక్తి మించి
తరుల భూధరముల తఱచుగానైన
కపులు దానవులకు లంకి యుద్ధంబు
విపరీతముగ సేయ వీక్షించి యపుడు
వాలి శక్తియై వాలినందనుడు
శైలంబు దెచ్చి యుత్సాహంబుతోన
వానరాంతకు మీద నలిగి వేయగను
దానవుండపుడు ధరణిపై గూలె
నార్చిరి దేవతుబాభిరంట నుండి
యార్చిరి వనచరులవని స్థలమున
ననుజుండు బడిన దేవాంతకుండపుడు
ఘనమైన పరిఘంబు కడిమిదిప్పరును
వడిరాఁగ కనుగొని వాయునందనుడు
పిడికిట నడునెత్తి బిట్టుగా బొడిచె
బొడిచిన యప్పుడు బొరిబొరిపళ్లు
కదుదుల్ల నెత్తురు గ్రక్కి భూస్థలిని
ద్రెల్లదైత్యుండు గ్రడ్లు తిరుగవై చదును
తల్లడిల్లగ దైత్యతతులు బారగను
దేవాంతకుని పాటు త్రిశిరుండు జూచి
వేవేగ నీలుపై నిశిఖంబులేయ
నలిగి నీలుఁడు ఖాని యుర్వధంబు నెత్తి
తలగొని యా మహోదరు పైవైచె

పై చినప్పుడు వాఁడు వసుధపై గూలె
జూచి దేవతులెల్ల చోద్యంబు నంద
త్రిశిరుండప్పుడు పేర్చి తివిరి మారుతిని
నిశిత బాణంబుల నెదియ నొప్పింప
ఆశని తుల్యాకృతి హనుమంతు దలిగి
త్రిశిరుని శిరములు త్రెంచివేయుటయు
త్రిశిరుఁడు భూస్థలిత్రెళ్లె త్రెస్సుటయు
త్రిశిరుని పాటిల్లి ద్రిష్టించి యవుడు
పటు రౌద్రమున మహాపార్శ్వుండు కనలి
పటుళుస నిజగదాదండము దాల్చి
హనుమంతుపైవైవ హనుమంతుడలిగి
పెనచి రాక్షసు రొమ్ము పిడికిట బొడిచె
బొడిచిన రక్తముల్ బొడబొడ గ్రక్కి-
మిడిగుడ్లు ద్రిప్పుచు మిగుల రోచుచును
పడితన్నుకొని మహాపాపాత్ముఁడా వేళ
విడిచి ప్రాణంబులు విబుధులుప్పొంగ
నా చందమున పౌరులందరు పడుట
జూచిన రోషణ విస్ఫురణ శోభిల్ల
మిత్రున లోకమ్ము మ్రింగుదుననుచు
కదఁగిన గరి త్రిభుకాయుండు చేర్చి
నదరారు సింహనాదము చెలఁగించి
పేరుజెప్పి హాడాగరిద్దం బిష్ట
కరావంబు నిగుడ కాలాగ్నిరీతి
రాష్టంబు లడ్డగింపు కపయు చరివమున
కపిసేనపై మహోగ్రంబు కోపాన

కపులు రాక్షసుని యాకారంబు జూచి
పటు రౌద్రలీల నప్పట్టా కుంభకర్ణుఁ
డిటువచ్చెనో యని యంతయు బెదర
పిడుగు మ్రైదాసిన మాడ్కి నెట్టిదంబుగాగ
నదరి మ్రోయుచు వచ్చు నరదంబుమీద
ఇంద్రచాపముతోడ సీసవచ్చునట్టి
సాంద్ర ప్రభాయత చాపమొప్పార
పరిఘ నవాప్రాస పట్టసశూల
పరశుతోమర భిండివాల చక్రాది
చర దివ్యశస్త్ర నివహంబుతోడ
సరుదైన సంహి సేయ ధ్వజంబొప్ప
నలువొప్ప నార్చుచు నలుగురు సూడసవ
ధులు దోల నొసవ యాతురగముల్ బూని
మూడు కన్నులుగల మూర్తియు బోలె
వేడిమి దిక్కులు వెదజల్లుకొనుచు
కపులపైనేతెర కపులంత జూచి
చపలులై వారనా సైన్యంబులోన
ఖంధనోరద్రగుండు గవయుఁ గోము
ఖుండును జ్యోతిర్ముఖుండు కుముదుండు
మరుతాత్మజుండును మైంచుండు నళుఁడు
శరభుండు నీలుండు శతవలి గజుఁడు
నాడిగా గలుగు మహాయూథపతులు
ప్రోదిగా వృక్షముల్ భూధరంబులను
వడి నొగయెక్క వడి వానికి నెదురు
నడిసె వారలజూచి నవ్వి దానవుఁడు

ఓ కపులార మీరూరక బడక
తోకలు ముణుదు కౌతక లంక
యంభోధి నెఘనుండద్భుతంబుగను
ఘంభీర సాయకాగ్రంబున నిలిపె
నా మహాత్మ్మని జూపుంతతనిపై గాని
యేము కొన్నట్టి నా యస్త్రంబు విడువ
దురమున నింద్ర జిత్తుండు గట్టినట్టి
యురగ పాశమ్ముల నూడ్చుకొన్నట్టి
యతఁడెవ్వండిట జూపుండతనిపైగాని
యతి భీమమైన నా యస్త్రంబు విడువ
రావణు పరిమార్చరణములో ననుచు
వావిరి లంకకు వచ్చియున్నట్టి
యతఁడెవ్వండిట జూపుంతతనిపైగాని
యతి భీమమైన నా యస్త్రంబు విడువ
యని పెక్కు గర్వము లాడుచునున్న
దనుజాధి నాథుని తనయుని నిట్టి
తరుచర ప్రముఖులుద్దండులై పేర్చి
తరు గపశిరధరముల తరుచుగా నేయ
దడఁగి రూపులనతి కాయుండు ద్రుంచి
పడవైచి లోకనే ప్లవగ సంఘముల
రాముచేబడి రయమున ముక్తి
కామిని మణిని నేఁగ్రైకొందు ననుచు
దెప్పర కపులకు చెదరక తోలుచును
వచ్చి నవ్వుచును భూవరున కిట్లనియె
ఓరామ మా వైరమొప్పునే నీకు

నీ రూపు నీలావు నే నెరుంగుదును
నీవు రాజని నేడు నేను వచ్చితిని
నీ వాక్క రాజువె నిన్ను జూడగను
దేవ సంఘములలో దృష్టించి జూడ
నీ ఒక్కండవుగావు నిన్ను నే గెల్వ
కులమును గుణమును గోత్రంబు కడిమి
నిలుకడమానంబు నీకెందు గలదు
పసువతిమునుల లోపల నుండునీవు
జనమర్ధిబోనాడ నా యీడు గావు
తడయక వార్ధిలో దాగిన గాని
విడువక నిన్ను నే వెదకి పట్టుదును
కడుపులో తలబెట్టి కడువేడుకొన్న
విడువను జూడు నా విక్రమ స్ఫూర్తి
కడిమి నోటను తుంగ కర్చినగాని
విడువను జూడు నా విక్రమ స్ఫూర్తి
విడిచి కైదున పండ్లు వెసజాపుచున్న
విడువను జూడునా విక్రమస్ఫూర్తి
వడి నిచ్చమెత్తడి వాడున్న విడువజూడు
పుడమి వెల్పని జందెమునను జూపినను
విడువను జూడ తడయక నేనుంత తపసినేమన్న
విడువను జూడు నా విక్రమ స్ఫూర్తి
యని యిట్టులాడెడి యతి కాయుజూడి
ఘన శౌర్యధైర్యైన లక్ష్మణుండిట్టునియె
ఓరి నిశాటనేనుండ రాఘవుని
తోరణం బొనరింప దొరకునే నీకు

సమరంబులోనింత చక్కగా నిల్వ
నిముషంబులో బట్టి నిన్ను వధియింతు
నన నతికాయుండత్యాగ్రహంబునను
తనలుచు శితసాయకముల నేయగను
శరముల ద్రుంచి లక్ష్మణుఁడు కోపించి
సురసిద్ధసాధ్యులు జూచి భూషింప
క్రూర బాణంబుల కుటిల రాక్షసుని
సారెకునేయ జర్జరితాంగుడగుచు
నతి కాయుడపుడు రామానుజు మీద
ప్రతి శరంబులువైచి ఖర్జింపుచుండ
నపుడు సౌమిత్రితోన నీలుఁడిట్లనియె
విపరీత శౌర్యుండు వీఁడు దుర్జయుడు
బ్రహ్మాస్త్రమున వీని పరిమార్పుమనిన
బ్రహ్మాస్త్రమంత సద్భక్తి సంధించి
సౌమిత్రి వాని లక్ష్యంబుగా జూచి
యా మహారాక్షసు నదరంటనేసె
నేసిన బ్రహ్మాండమెల్ల కంపించె
వాసవ ప్రముఖ గీర్వాణులు బెదరి
రా యస్త్రమును జూచి యతికాయుడవుడు
పాయక తనచేతి బాణంబులేయ
నదిలెక్క చేయక నా మహాస్త్రంబు
వదలక ప్రళయాగ్నివలె వచ్చివచ్చి
మండిత కోటీర మండలితోడ
కుండలంబులతోడ గూల్చె తచ్ఛిరము
హత శేషముఖమున నతికాయు పాటు

సతతంబుగా వీని సహస్రైయుంత
రావణుఁడాత్మను రాము విక్రమము
భావించి భాసించి పలుమారు పగచి
అంతఃపురంబున కరిగి యుక్కరుడు
సంతరంగంబున సలుప సుంచ
సప్పుడు తపుసంచి యుం మఖనాసతి
సప్పం ప్రకెండుకే సనియు నింపెంర
వగపేలదేవభూ స్పపనానరుల
ఆగమెరుంగగ నేను సాధించివత్తు
ననివీడుకొని దివ్యము రథంబెక్కి
దనుజేంద్ర దనయుడెంతయు సొంపుమీర
నప్పుడుగ్రత చతురంగ సైన్యములు
కప్పి దిక్కులు నాల్గు ఏపయుచు రాగ
బహు భూషణప్రభా పటలంబు వెలుగ
సహజ వైభవ మహోజ్జ్వలు డింద్రజిత్తు
రక్త వస్త్రంబులు రక్తమాల్యములు
రక్త గంధంబుల రాజితుండగుచు
ననలు ప్రతిష్ఠించి నాహుతిజెంది
యనలుని కరుణ బ్రహ్మాస్త్రంబు రథము
ధనువుకో కవచంబు తద్దయు ప్రీతి
గోడియాడ్చుచుసు కపికోటులు బెదర
రథరథ్యకేతు సాంఘులతో నెగసి
ప్రగిత వేగమున నంబరసీఘ దాగి
తరుచలీ సేనల తాకి ప్రౌఢ్ధంత
పరువడితో క్రూర బాణంబులేసి

ఁ దవినుండి దివ్యాస్త్రంబు లేయ

నా దానవుని దెసనగచరు తెగని

నగములు పై వంగ నిపెద్యంచి గుండె

తగలించి పెక్కండ్ర నవనిపై గూల్చి

నొక్కొక్క పురమున నొగి లక్ష్మణుఁడు

తక్కిన కపుల విదారించి వైఁ

హనుమంతు డాదిగా సకల యూథముల

ఘన శరంబుల చాపములు గూర్చె

వనచరులెల్లను వసుధపై పడిన

కని లక్ష్మణుఁడు రాఘవున కిట్లనియె

దేవ బ్రహ్మాస్త్రంబు దీపింప చేరె

రావణాత్మజుని నే రయమున ద్రుంతు

ననుడు రాముఁడు వినికై జగంబులకు

వొనరె భస్మముచేయు టుచితంబుగాదు

మనకు ననుచుంత రావణ యా రాఘవులను

కనుదేరవని మూర్ఛగా యినవంశజుల

వన నిధిలో బడినట్లు పడిగ్రుంకె సూర్యుండు

బలిమినీలాగు దెబ్బది రెండువేల

వలబాణ జలనిధి వల.నొప్ప ముంచి

అలంబు చాలించి యా యింద్రజిత్తు

బాలంక లోపలి కరిగెనప్పుడును

ఆ యుద్ధరంగ సారథి విభీషణుఁడు

వాయుజుండును జాంబవంతుడు రణము

పరికింపుచును వచ్చి భల్లూకపతుఁడు

మారుతాత్మజు చూచి మారుతి నీవు

గొనివచ్చి మందుల నంటని కపుల
పనిబాంతిపలుసు వడిబ్రోవు మనుఁడు
హనుమంతుఁ డపుడు సుధాంబుధి చేరి
పనుపడి ఔషధ పర్వతంబునకు
పరువడి గొనిదెచ్చి బ్రతికించి వారి
మరలి గొంపోయి యమ్మహీమంత గిరిని
లప్పుడానందించి రఖిల గీర్వాణు
లప్పుడానందించి రఖిల వానరులు
భానుజుండా రామభద్రుని కనియె
దాసవాసిక మంతయు చప్పకతన
రావణుఁడని కింకరాడు శ్రీరామ
కోపున యీ లంకగాల్ప వానరుల
బనిచెదసని యోధవరుల పొమ్మనిన
దినమండలము గ్రుంకనీక్షించి కపులు
గురుది యార్పుచు పెద్ద కొరవులుబట్టి
కొనిలంక కోటపై కుప్పించి దాటి
కడు జవంబున లంకకాల్చి పేర్చినను
బడిసి రాక్షసులు నిచ్చలు మొరలుపెట్ట
విని రావణుఁడు క్రోధ వికృతాస్యుఁడగుచు
కనుగవ కోపాగ్ని కణములు దొరుగ
దంభోళి తుల్య ద్రుతాస్త్రులైనట్టి
కుంభనికుంభుల క్రూర విక్రముల
ననుప వారలు శతాంగరూఢులగుచు
చనుదెంచి వానర సైన్యంబు దాకి
బడులు నూరువంధ పదివేలు లక్ష

కదిలి లక్ష్మణాకారకర్కశ బాణంబు చేత
జతపై వర బయూషపతులెల్ల దాఁగ
కడఁగి సుగ్రీవుండు ఘనశిలయెత్తి
కుంభునిపై వైచి కోయని యార్వ
కుంభుండప్పుడు గూలెకొంత చందమున
కుంభునిపాయ నికుంభుఁడు చూచి
దంభోళితుల్యాస్త్ర తతుల భానుజుని
నొప్పింప వాయు తనూభవుండలిగి
గుప్పున దృఢముష్టి గొనిరొమ్ము పొడువ
బడెను కుంభుండు కుల పర్వతులనగ
బడిన వానిని జూచి హర్షించిరంత
హత శేషులదినేర్చ సరిగి రావణుఁడు
మతిలోన చింతించి మకరాక్షుఁబనుప
వాఁడు రథంబెక్కి వాలిసుత త్రి
వేడిమి చూపుచు నీరవానరుల
దాకిన వానరుల్ తరులును గిరులు
దాఁకఁగా గొనితెచ్చి వేయ వారంత
ఖండించి శరముల కపులకు నరుల
దండాంశుకులుఁడంత చాపంబు బూని
మకరాక్షుం డేసిన మార్గణంబులను
వికలంబు గావించి విబుధులు పొగడ
వాని జోతసతెల్లవడి ద్రుంచివైచి
వాని నాగ్నేయాస్త్రవర్షించి గూల్చె
జగదీశు జయము నిచ్చలు చూడవచ్చు
వసుది పూర్వాద్రిపై నాసుంతు ద్రి...

విని మకరాక్షుని విధము రావణుఁడు
బనిచెప్పఁ ద్రుంచి మనుసుల నింద్రజిత్తు
వాఁడు హోమముఁజేసి వడిరథంబెక్కి
పోడిమి కృతితోన పొదవునడాఁగి
సంధించి శరముల సంఖ్యంబునేయ
సంధకారావృతంబయ్యె భూస్థలము
నాయప్పసోనల నగచరుల బడఁగ
పాఁయక రాముఁడా బలికె లక్ష్మణుఁడు
వీని మాయలతోఁక వీని వధింతు
మానవాధీశ్వర మన్నింపు మనుఁడు
నిను బ్రహ్మవరముచే వీఁడసాధ్యుఁడు
మన శస్త్రములు వీని మర్దింప చాల
వనుచుండ రాముతోన నీలుఁడిట్లనియె
అనల సాయక మేము మనవీర వీఁడు
కనబడు బొమ్మలు ఖండింపుమనిన
కాలరుద్రునిరీతి కనలి రాముఁ
డాలోన నాగి యమసురపైనేయ
కృత్రియత్యద్భుత క్రియ నింద్రజిత్తు
సత్వంత గలిదాఁకి యుడిగె నెందేని
అంత భూమికివచ్చి యా యింద్రజిత్తు
పంతంబుతోఁగ బారంబు మోయించి
విపరీతముగ నుగ్రవిశిఖంబు లేయ
కపివీరులటు తనుగారింప నార్చి
యారింట మారుతి నారింటకుముదు
నారింట సంగదు నారింట నీలు

నారింట పనసుని నారింట తారు
నారింట సుగ్రీవు నారింట వినతు
అరువదింటను రాముసల్లు లక్ష్మణుని
శర శరంబున విభీషణు నేసియార్చి
సౌమిత్రి చాపంబు సర చతురుండై తునియ
రామచంద్రునితోడ రాక్షసుండనియె
కంటివే రామ నా కార్ముకప్రౌఢి
గంటివాలైరి యీ మర్కట ప్రముఖు
లని యార్చి గర్వించుచునుచు లంకకును
చని తండ్రి కాతనజయమెల్ల చెప్ప
విని రావణుండు పుత్రువీక్షించి బలికె
నరుల వానరుల ప్రాణముల తోడించి
సురము గిల్చితి నన్ను నొదుకునే కీర్తి
యేమిచ్చిరాశయ దేమిటి పోక
నీ మహత్వంబేమి నీ కార్యమేమి
ధానుపంకజాల నోప్పవగల సూల్చి
వీనుల కింపుగా వినుబంచి తేని
నీవు కూరుంచని నేయెత్తనిని
భావించి యంతయుబలుమారు బలుక
దానునిమ్మని కోర్కె కడదేర్తుననుచు
తాను తండ్రికి మ్రొక్కి తగనింద్రజిత్తు
సీత చందముగాగ చెలువొప్పనొక్క
నాతి గాదన మాయ నపుర గల్పించి
అలయింద్రజిత్తు మాయాసీతగానుచు
వలనొప్ప పసమటి వాకిట వెడలి

అనికి సన్నద్ధుఁడై హనుమంతుడపుడు
వనచర బలముతో వచ్చిన ననియె
యీ సీతకొఱకు మీరిందరు కూడి
గాసి నెందెదరిపేఁత ఖండింతు దీని
ననుచు ముందర బట్టి హుంకృతినిచ్చి
కనియింద్రజిత్తుతో కపి వీరుఁడనియె
వోరి రామద్రోహి వోరి దురాత్మ
యీరీతి పాపంబు సేల యొగ్గెదవు
విడువు దున్నను వాఁడు విడువక కురులు
కదగి శ్రీరఘురామ కావవే యనుచు
తలకు మాయాసీత తలదువ్వనేసె
గలికేగి వటుసింహనాదంబు చేసె
హనుమంతు దవ్వుదయ్యావనిజ పాటు
గని మూర్ఛ నెంది వేగమె మూర్ఛ దెలిసి
వనచరపతులన వ్వాకిట నునిచి
చనె రామున కీ సమాచారంబు దెలుప
తదనంతరంబు యా దశకంఠసుతుఁడు
చని నికుంబుని బిలిచె తోచిన భక్తితోన
ననలుని రుధిరమాంసాదుల దనిపి
హోమంబు చేయుచునుండె నవ్వేలకు
ఆమారుతాత్మజుండరిగి వేగమున
శ్రీరాము తోడనా సీత చందంబు
వారక దెల్ప భూవరుఁడు మూర్ఛిల్లె
అవనిపై బడియున్న యన్నను యెత్తి
వివశుఁడై సౌమిత్రి వెసతోడ నుంచి

అక్కటరాదు నియట్టి యుత్తమమున
కిక్కు కంకములు నీకెయిచ్చి చూడ
ధర్మమే జయమని తలంతురు బుధులు
ధర్మమాపదలకు దగమూలమయ్యె
ధనహీనులెన్నేడి తలంపులు ధరను
కొనసాగునెవట్టి కోర్కెలుగాని
సరసమైనట్టి రాజ్యము బోయినపుడె
పురుషార్థములు స్థితిబొందునేమనకు
కలవారు బంధులు గలవారు సుమ్మీ
కలవారు తలంచిన కాంక్షలీడేరు
ధనికుండే కులజుండు ధనికుండే దాతా
ధనికుండే పూజ్యుండు ధనికుడే బుధుడు
ధనముచే వర్తించు వర్తించు ధర్మాదులెల్ల
ధనమూలమీ జగత్త్రయము చూడగను
లేమి వచ్చిన యంతలేరు బాంధవులు
లేమి వచ్చిన యంతలేదు పౌరుషము
లేమి వచ్చిన యంత లేదు సౌఖ్యంబు
లేమి వచ్చిన యంతలేదు బలంబు
కావున రాజ్యంబు కటకటావిడిచి
వేవేగయాఘోర విపిన భూములకు
వచ్చినప్పుడె కూడ వచ్చెయీ వ్యతలు
చెచ్చెర విధియంత చేసెనేమందు
అని లక్ష్మణుండు పల్కనా విభీషణుండు
వినయోక్తి శ్రీరామ విభుని కిట్లనియె
వేయాల రఘురామ వ్యస నింద్రజిత్తు

మాయ యింతే కాని మహినొందు కాదు
దురితాత్ముడగు సురద్రోహి రావణుఁడు
ధరణిజ చంపింప దలఁచదెంతైన
హనుమంతు పంచించి యానికుంభిలకు
చనివాఁడు హోమంబు జలుపుచున్నాడు
హోమంబు పూర్తిగా నొనరించె నేని
రాఘవాని జయింప రాదెవ్వరికిని
కావున హోమ విఘ్నంబు గావింప
వేవేగ నీ మహావీరులక్ష్మణుని
పంపు మీ సౌమిత్రి పక్షిరావణుని
చంపనేర్వడన్న జననాథుఁడలరి
వినుము లక్ష్మణ నీవు వేగంబెయందు
చని యింద్రజిత్తును సమయించిరమ్ము
యీ వాయునందనుఁడీ విభీషణుఁడు
వావిరి తోడుగా వత్తురు నీకు
జయమునిత్తురు సకల దేవతలు
జయశాలివై రమ్ము చనుమని కార్మ
కాదుల దీవించి యను జన్మ నొసఁగ
సాదరమ్మున కాని సౌమిత్రి పొంగి
యన్నకు మ్రొక్కి యా హనుమంతు నెక్కి
పన్నుగా వనచర ప్రముఖులు గొల్వ
వెనుపొందగా నికుంభిల కేగుదేర
దనుజతుంగ తురంగదంతి శతాంగ
నివహోన్నత స్థలి నెలకొని హోమ
మవిరళంబుగ జేయు నా యింద్రజిత్తు

కని విభీషణుఁడు లక్ష్మణున కిట్లనియె
సౌమిత్రి రాక్షస సైన్యముల కాచిముంచి
హోమ విఘ్నము సేయు మొగి సేయకున్న
పీఁదసాధ్యుండగు విని లక్ష్మణుండు
వాదిమ్మి చూసి దురువార కోపంబ
ధారియై శరములుద్ధతిని సంధించి
ఘోర రాక్షస కోటి గూల్చిన చూచి
యా యింద్రజిత్తుఁడాకాహుతి దక్క-
నాయన్నెలో కలుగు నాహుతు లెల్ల
వేల్చి పూర్ణాహుతి విహిత మంత్రముల
వేల్చక మున్నెయీ విఘ్నంబు పొదమే
నని పేర్చి కాలానలాకృతి పొదలి
సమ్మభీషణ పారుష్యం శనంబెక్కి
సముదగ్ర కార్ముక జ్యాని నాదముల
బ్రహ్మాండ భాండంబు పగుల కోపించి
సింహ నాదముజేసి గర్జించియాత
బ్రహ్మదులెల్లను భయమంది చూడ
శరపరంపరలను సకల వాసరుల
పరిమార్చిరణ వీరభద్రుడై వచ్చు
నా యింద్రజిత్తున కనియె లక్ష్మణుఁడు
మాయలన్నక యింక మగవాఁడవైతె
నిమిషంబు నా ముందు నిలిచితివేని
సమర కాళికి నిన్ను చంపి బలియిత్తు
ననిన లక్ష్మణుజూచి యా యింద్రజిత్తు
కనులను కోపాగ్ని కణములు రాలుగ

జాలుండవై యుంటి పంతంబు లేల
యీ లీల నిలుపు మీ యింపుల తగువు
లక్ష్మణ నిన్ను నాలంబున వీర
లక్ష్మికి నెడబాపి లావెడలింతు
నని బల్కి వెంబడి యా విభీషణుని
కనుగొని యింద్రారి కలుషించి బలికె
పినతండ్రివిటనీవు ప్రియమాతనేను
తనయుండ నా కీడు తలపంగ తగునె
విడిచి బాంధవులను విడిచి సోదరుల
జడని శాత్రవులను శరణు జొచ్చితివి
యిది యెక్క కడిమియె యిదియెక్క బ్రదుకె
తుది జూడ కులశత్రు ద్రోహివినీవు
నా వుండు దశకంఠనందను జూచి
యా విభీషణుడిట్టులనియె కోపమున
నా వర్తనము పావనము సురద్రోహి
మీ వర్తనమ్ముల మెచ్చరెవ్వరును
దశకంఠునికి నీవు తనయుండు గాగ
విశద ధర్మము నీకు విషమౌటి యరుదె
దురితాత్ముడైనట్టి తోబుట్టునైన
పరిహరించుట యిది పరమ ధర్మంబు
పరకామినీ ధనవరులైన మీకు
చిరకీర్తులాయువు చేకూడ గలదె
యనుడు రావణు సుతుండాగ్రహంబునను
తనతేరు తోలించి తనపేరు బాడి
సౌమిత్రిపై విభీషణుమీదనపుడు

ధూమ కాంతమ్ముల పెల్లుపైన
సరకు గైకొనక లక్ష్మణుఁడు కోపించి
శరవార్థిలోన రాక్షసు ముంచి వైచె
చెలఁగి యా యిద్దరు సింహనాదములు
బలువిడి వరగించు పాపఘట్టనల
పెలుపైన చలముల భుజ బలంబులను
విలసిల్లు నార్పుల విక్రమోన్నతుల
ననిశంబు వెలయు చంద్రార్కుల బోలి
తనరు చతుర్దంత దంతుల బోలి
కొమరారు సింగంబు కొదమల బోలి
కమనీయ శరజతారకులను బోలి
యేపార వృత్రాసురేంద్రుల బోలి
రూపింపగా కాలరుద్రుల బోలి
బలివిడి జయకాంక్షవరఁగి నొక్కొకరు
నిలునిలు పోనీను నినుగూల్తు ననుచు
పలుకుచు చెలరేగి పంతగింపుచును
సరిసరిగా బాణసంఘ మేయుచును
శరలాఘవంబుల కదగి మెచ్చుచును
పోరిలో నీరీతి పోరుచునుంత
నా రావణాత్మజుండధిక కోపమున
సురగాస్త్ర మప్పుడత్యుగ్రత నేయ
గరుడాస్త్రమునద్రుంచె కడగి సౌమిత్రి
తగ కుబేరాస్త్రమ్ము దానవుండేయ
డగచితముగ ద్రుంచె నతఁడు మర్మమున
నమరేంద్ర వైరి వాయవ్యాస్త్రమేయ

సమర నాతఁడు ద్రుంప నైగ్నేయాస్త్రమునను
దానవుండపుడు గాంధర్వాస్త్రమేయ
దాని లక్ష్మణుఁడు రౌద్రమ్మున ద్రుంచె
చలమున నిటువారు సమరంబు సేయ
ప్రళయ కాలమునాటి పగిదియై తోఁచె
నంత లక్ష్మణుఁడు సైయ్యంతకు కరణి
సంతరంతకు నుగ్రుఁడై యింద్రజిత్తు
నటుజూచి రామునికజ్యాని నాదంబు
పటుశక్తి నొనరించి బహురయంబునను
పేర్మినైంద్రాస్త్రంబు పెనుపొంద తొడిగి
ధర్మాత్ముఁడగునేని దశరథరాముఁ
డగణిత విక్రముండతి సత్యసంధు
డగునేని సాయక యసురారిపైన
రావణి తలద్రుంచు రయమున ననుచు
భావించి యేసిన ప్రళయ చండాంశు
మండలోగ్ర ప్రభామండితంబగుచు
చండవాత కీల సమవేగమగుచు
ఖండితారాతి చక్రమురీతి వచ్చి
కుండలంబులతోన కూల్చె తచ్చిరము
యనిలో బడియున్న యా యింద్రజిత్తు
కనుగొని విజయ శంఖంబు పూరించి
లక్ష్మణుం డతులిత లక్ష్మణుఁడు జయ
లక్ష్మిచే వెలిసె నాలంబులో నపుడు
కరమర్థి లక్ష్మణు కౌగిట జేర్చి
మురుదొంది వినుతించె నవ్విభీషణుఁడు

వసువడి కపులెల్ల ప్రణుతించి రతసి
యసువొంద నుతియించి రఖిల దేవతలు
సుమ వృష్టులంటంప సోసత్తై గరిసె
ధిమిధిమియని మ్రోగె దేవదుందుభులు
వనచర సంఘమువ్వారిగా గొల్వ
చనుదెంచి సౌమిత్రి సప్రశ్రితోన
రామునికిని మ్రొక్క రాముడుప్పొంగి
ప్రేమతో తమ్ముని బిగి కౌగిలించి
గొనకొని శిరము మూర్కొని విభీషణుని
కొనియాడుచును సుఖగోష్ఠి నందుంత
అత్తరి రాక్షసులా యింద్రజిత్తు
వృత్తాంతములు చెప్ప విని రావణుండు
వెగలింపు మహాటు వటలించిరంత
వెడలి రాక్షసవీరు లల్లార్చుచును
వికృత వేషంబులు వికృత ఘోషములు
వికృత నేత్రంబులు వికృత గాత్రములు
కలిగి భయంకరాకారులైనారు
నిప్పలపిల దిశలెల్ల పిక్కటిల్లగను
టిరిఘటా ఘుంకార ఘటితానేక
తురగ ఘోషారావ దుందుభి శంఖ
పటహఢక్కాహుమికా పణవాది వాద్య
పటు భీకరధ్వాత పటపటాత్కార
రథనేమి శింజినీరావ సంకులము
బుధిరార్ణవ ధ్వనిమాడ్కి శోభిల్ల
కరమర్ది తెండూళి గగనంబు గట్ట

పరమ లంకాంబుధి బడబాగ్నులనగ
నేల యీనినయట్లు నిబిడంబుగాగ
నాలంబు కై వాహనా రూఢులగుచు
కాలమేఘమ్ముల కరణి నాగ్నికాగి
బలిమెత్తె తెప్పిల్లి పరఁగు కోపమున
భూమిజపతిచూచి పుత్రశోకంబు
నామీద నేర్తునేనని నిశ్చయించి
చంద్రహాసము బూని చనుదెంచు రాక్ష
సేంద్రుని కద్దమై యెలమి సుపాంశుఁడును
సురేశయిది ధర్మహానితలఁపగను
సరియని తలచుట సాటిగాదెపుడు
నసమున కోపమూ యర్క వంశజుల
నైజూపవలెగాని భామిని ద్రుంచి
వైచుట నీతియే వలదని బుద్ధి చెప్పి
రావణు దెచ్చి సింహాసనమున
నెప్పటివలె నుంచె యేపు మీరగను
తన మంత్రులను జూచి దశముఖుండనియె
కనుగొంటి రే నేడు కాలకౌటిల్య
మనుపమ బలశాలి యగు నింద్రజిత్తు
మనుజుఁ డొక్కడు గూల్చె మాటలింకేల
వలనొవ్వనొక బాధవచ్చిన వేళ
తలఁకు దుండుట వీర ధర్మంబు గాదు
నదుల వానరుల రణస్థలంబునను
పరిమార్చుచును కాలరుద్రుని మాడ్కి
కపులపై దాకిన కపులు కోపించి

విపరీత పర్వత వృక్షంబులెత్తి
దేరివా సైన్యంబుపై దట్టించియాయ
దనుజులు కపులనుద్ధతి తాకిరపుడు
వాటుల వ్రేటుల వడినిందునేందు
పోటుల నేటుల పోరినినిందందు
కరవాలములను భీకర వాలములను
శరముల భీమము ధరములనైన
తరుచరులావై సంగడజులువైవ
ధరణిపై పెను రక్తధారలు దొరుగ
వనచరుల్ దనుజులపడి తాకితాకి
కనుకను చేనున్నగిరుల గ్రుమ్మియును
పీకె గోరమ్ముల విరుగ ద్రొక్కియును
మోకాళ్ళ మోచేత ముష్టినుట్టనల
తాకించి తలలు ద్రొక్కియును
తోకల గొట్టి తుత్తుమురు చేసియును
పొట్టలు చీరియు పోసికజుట్టి
చట్టలు వాపియు చదియవ్రేసియును
కరచియు విరిచియు కడకాళ్ళబట్టి
గిరగిరగా త్రిప్పిచిమ్మి వైచియును
పెళపెళ నెమికలు పిండిసేయుచును
భళిభళియని భూతపంక్తులు పొగడ
నీరు చేతులందును నిరుపురి బట్టి
పోరిపోరి తాకించి పోట్లు సేయుచును
తరుచరులార్వంగ దనుజులు జూచి
పరిగడా చక్రపట్ట సప్రాస

పరిఘతోమర భిండివాల ప్రాసల
కరపత్ర టంకముద్గరముల బూని
నరికియు నరచియు నలియ మొందియును
నురువడి కుమ్మియు నురగ చిమ్మియును
చనుజాలార్చి జూచి తరుచరుల్ బెదరి
జననాథు మరుగున చనిన రాఘవుఁడు
నెమ్మితో దానవ నికరంబు జూచి
సమ్మోహనాస్త్రంబు సంధించి యాయ
నన్యోన్యమును రాములని రోషమునను
జన్యంబు గావించి సకల రాక్షసులు
ఖండితావయవ నికాయులై యవని
నిండార పడిసిరి నిమిష మాత్రమున
నా వార్తవిని రాక్షసాంగన లంత
రావణుపెను హాహాకారముతేరి యందు
మొనయ శోకముల కొమ్ముల మొదుకొనగ
విని రావణుఁడు కోప విషసుఁడై యపుడు
సకలాయుధావృత సంపూర్ణ రత్న
ధగధగ ద్యుతియు తస్యందనం బెక్కి
దివ్య భూషణములు దివ్యాంబరములు
దివ్య మాల్యంబులు తేజరిల్లగను
దానవ ప్రముఖితుదండల గొల్వ
సాసా వృపంగ నిపాపముల్ మొరయ
తదయక నుత్తర ద్వారంబుసందు
వెడలి యుద్ధోన్మత్తు వెసవిరూపాక్షు
కనిబల్కె మీదనీ కపిసైన్య తతుల

పేనిలాష్య ఖణియింపుదంతలో సను
మనుజుల రామలక్ష్మణుల నిద్రింతు
అని బల్కి దానవులార్చుచు వెదలి
వనచర బలముల వడతాకి తాకి
ముసలతోమర దాముద్గర పర
పీసరముల్ వైతు పీచి పెల్లేచి
యంకు శకుంత కూలాదుల పోదుతు
రంకించి నేయుదురాభీల గదల
సదిదముల్ ఝళిపించి నలుకసంగముల
కడిబందలుగనేసి కడిమి చూపుదురు
కపులును కపిలీల తైకవిమి పాటించి
రిపుల శైలంబుల వృక్షజాలముల
వడదంత నఖవాల పాషాణ స్తముల
నరముక్తై యా రాక్షసేనలనెల్ల
శిరములు సరములు ఒదలు మూరు(
లురుములు బాహాపులా ప్రకంరములు
త్రెంచియు దంచియు తీవ్రమై ఖరిని
చించియు నొంచియు చిదిమియు సదిమి
తరుచంపకులను వసుధాంతరము
పరుపడి యా విరూపాక్షుం చర్కజాని
శరముల నొప్పింప బలజా ప్రసుతుడు
దరపుక్తి వాని వక్షస్థలంబునను
పిడుగుగ దులియాని పితికిట పొడువ
పడగూలె నా విరూపాక్షు దంతటను
పడిన విరూపాక్షు పాటెల్లగాచె

యిటు యుద్దోన్నతుండర్కజు మీద
కనలుచు పడువ నంగదుఁడు కోపించి
కినుకతోడుత గొప్ప గిరియెత్తి వైవ
తునియ నంగములు నెత్తురులు గ్రక్కుచును
దనుజుండు మిడుకుచు ధరణిపై గూలె
నంత రావణుఁడు కాలాంతకు పగిది
పంతంబుతోన చాపంబుచే బూని
కాల భుజంగ సంకాశ బాణముల
కీలించి కపులను గిట్టిబెట్టేయ
గడగడ కంపించి కపులు దిక్కులను
జడిసి పారగ రామసౌమిత్రులపుడు
శరధుల గుణముల సంధించి గొట్టె
పరువడి కోదండ పాణులై నిలువ
దశముఖుండలుకను దశదిశ దాక
దశరథ రాముపై తన తేరు జరుప
సౌమిత్రి యెదురుగా శరములు నేయ
సౌమిత్రి శరముల సరకుగా గొనక
రావణుఁడేతెంచి రాము మార్కొనియె
రావణుఁడాఁకె నా రఘువీరుఁడలిగి
రామ రావణులు సౌరథమ్ము లెసఁగ
సీమ కార్ముక గుణాంచర నాదముల
శరధులు కలఁగంగ నగములు పగుల
పరువడి సన్యోన్య బాణసంతతుల
ఘనభాంతరముల పోలుపారనిండె
దానవాధిపుడేసె శతామి ప్రశరము

ఘుడమైన చీకట్లు గ్రమ్మినా తిమిర
మునల జాణమ్మున నణచె రామవుఁడు
వానిగాంచంత తాపమఁదు కోపించి
యా సురాస్త్రం జేయ సందున శెక్కు
ముఖములు శార్దూల ముఖములనుస్వ
ముఖములు సూకర ముఖముల మకర
ముఖములఁగరి శైరి ముఖముల పంతి
ముఖముల ఘుగ్ర్వద్రముఖముల మహ
ఘునసిత ముఖములై రడు నెక్కు నిగుట
గని వాని తునకలుగాజేసి మగుర
జనేనాథుఁదాగ్నేయ శరమేయ పహ్ని
దినకర ముఖములై దిశలందు బరువ
సన్నోన్య మిట్లు ప్రత్యస్త్రముల్ నేసి
జన్యంబు గావించు సమయంబునందు
నెదజొచ్చి లక్ష్మణుండేడు బాణముల
సరి గేహరథిని చాపము ద్రుంచివై చె
నా విభీషణుండంత హయములు గూల్ప
రావణుండొక శక్తి రయమున బూని
తమ్ముని పైవైవ దశరథ రాము
తమ్ముఁడా శక్తినుద్ధతి ద్రుంచివై చె
నదరి రావణుఁడపుడామయు శక్తి
వడిగ విభీషణు మీదవైన హుంకింప
శరణు జొచ్చిన విభీషణుని పిమ్మటను
సరగున నిడుకొని సౌమిత్రి నిలువ
రనజేరి శక్తిని దశముఖుండపుడు

ఘన శౌర్యుఁడైన లక్ష్మణు మీదవైచె
వైచిన శక్తి దుర్వార దర్మక
రోచిత జిహ్వాసముగ్రమై వచ్చి
యా లక్ష్మణుని వక్షమందు జొచ్చినను
తూలెనా సౌమిత్రి దురము లోపలను
సౌమిత్రి పడియున్న చందంబు చూచి
రాముఁడు శోకాంబురాశిలో మునిగి
పలవల కంటను బాష్పముల్ దొరుగ
వలనొప్ప శక్తియువ్వల తీసివైచి
కపులను జూచి యా రాఘవుడిట్టులనియె
కపులార మీరు లక్ష్మణు కాచియుండుఁడు
దనిలోననెందు పరాక్రమవధియింతు
అని పల్కి శోకంబునటు కట్టిపెట్టియు
దండ ధర భీకరాయతంబైన కో
దండమప్పుడు గొనుచు మెక్కించి
అరుణారవిందాక్షుఁడై రాఘవుండు
శరపరంపర నిట సంధించి యార్చి
రావణుపై నేయ రావణుండలిగి
కావరంబున భీమ కాండంబు లేయ
పంచాశుకులుఁడు రాక్షసుని కాండముల
ఖండించి కాలాగ్ని కైవడి కసలి
నొకట కార్ముకమును నొకరంపుజ్యాను
తునియంగ నేసి [illegible]పురు జేసి
ఘనకాల భుజగ భీకర సాయకముల
పడివేర్చి రావణును వక్షంబులనేయ

బడిసి బాణముల నుర్వరి త్రాంగుడగుచు
ఆరక్త ధారల నంగంబులదర
పేరుపై మూర్ఛిల్లె తివిరి రావణుఁడు
భయమంది సారథి బవరంబు విడిచి
జయమున గొనిపోయె రథము దప్పులను
గొనిపోవఁజూచి కాకుస్థ వంశజుఁడు
మనమున మన్నించి మగుడి వేగంబె
చేరి చింతాక్రాంత చిత్తుఁడై రాము
డారవితన యాంగదాదుల గనియె
నా జీవమైనట్టి నా కూర్మితమ్ము
డీ విధంబునసుండ నికనేది బ్రతుకు
తనకేల శౌర్యంబు తనకేల రణము
తనకేల మానంబు తనకేల సీత
యితనితోడిదె లోకమింతియె గాక
నితర చింతనము లింకేటికి తనకు
నా కూర్మి నిలకడ నా పట్టుకొమ్మ
నాకన్న పెన్నిధి నా నోముఫలము
నా తమ్ముడిటువలె నన్ను వంచించి
భూతలంబున నిద్రబోవుచునుండ
యెటువలె వేగింతునెట్లు సహింతు
కటకటాయగుచు ఘోరంబున బొగిలి
చింతింపుచుండ సుషేణుఁడు వచ్చి
యంతరంగమున ననియె రామునికి
వలవని శోకంబు వలదు శ్రీరామ
కలుగునే హాని లక్ష్మణ దేవునికిని

నిండుచందురు గోమునెమ్మోము వికచ
పుండరీకెంజాయ పొలుచు నేత్రములు
విలసిల్లుచున్నది వేరొండు లేదు
కల దుపాయమువేగ కరువడి సుతుని
పనిచిమందుల కొండపరఁగ దెప్పింపు
మన రామచంద్రుండు హనుమంతు బనుప
నావాయు నందనుండనిల వేగమున
ఆవేళ దనిదెచ్చి నౌషదగిరిని
కరిమర్ది యౌషధాఘ్రాణంబు వలన
మరలె జీవములు లక్ష్మణుని కంతటను
నిదురబోయిన రీతినెరియ మేల్కాంచి
సరయుండు సౌమిత్రి సద్భక్తితోన
రామచంద్రుని పాద రాజీవములకు
ప్రేమతో మ్రొక్క సంప్రీతి రాఘవుండు
రమ్మ నా పెన్నిధి రమ్మ రమ్మనుచు
తమ్ముని కౌగిట దయతోడ జేర్చి
శిరము మూర్కొని చిన్ని చెక్కిలినొక్కి
కరమర్థి సంతోష కలితుఁడై యుండి
యా విధంబున లేచి యఖిల వానరులు
భూవరునికి మ్రొక్కి పొలిపొందిరంత
నప్పవనాత్మజుఁడవుషద శైల
మెప్పటితావున నిడివచ్చెనపుడు
తూణీర కలితనిస్తుల బాహుమూల
బాణ బాణాసనపాణులై రామ
సౌమిత్రులప్పుడు సమరాంగణమున

సౌమసౌఖ్యల రీతి శోభిల్లిచూడ
అప్పుడా రావణుఁడా మూర్ఛదెలిసి
తప్పక సారథి తగఁజూచి బలికె
కలుషించి రిపుడుండ కడిమి నా రథము
తొలగించినప్పుడే ద్రోహి వీవనుఁడు
సారథిబలికె రాక్షసనాథ సధికు
లారణంబున కొంత యలసిన యంత
సదలింపవలె తేరుసమయంబు దెలిసి
నడిపింపవలె నిది న్యాయమ్ము సుమ్మి
దేవర మూర్ఛిల్లి త్రిప్పితి రథము
కావున నీకేగ కాదని దెల్ప
విని రావణుఁడు వాని వినుతించి మంచి
తన భూషణమ్ము లాతనికిచ్చి మెచ్చి
నేడు లక్ష్మణ సనున్వితుని రాఘవుని
పోడిమితో పోరిగొందు ననుచు
కాలదండాకార కార్ముక జ్వాలర
హిలోల చండ భీమార్చటుల్ మొరయ
వడి మహాటాపుల దుర్వారత బేర్చి
రదగి యుగ్రతకాల్చు కార్చిచ్చు మాడ్కి
నగణిత స్ఫుటవహ్నులా శుగమ్ములను
నిగుడించి క్రోతల నీరు జేయుచును
రాముని రక్షోభి రాముని భాసు
ధాముని సంగకోద్దాముని దాఁక
దేవేంద్రు నసుమతి తెరఁగొప్పవచ్చి
యావేళ మాతలియనియె రామునికి

శరణాగతత్రాణ జయధామ రామ
పురుహూతుఁ డిదె నీకు పుత్తెంచె రథము
కాకుత్స్థ యీ వజ్ర కవచంబు బూని
శ్రీకర రథమెక్కి శిక్షింపు వీని
యనవిని యా మునియవ్విభీషణాని
యనుమతిలోడుర నా రథంబెక్కి
నదల నొక్కట పర్వజయజయధ్వనులు
పొదివి శాఖామృగంబులు సంతసిల్ల
సురపతి కపలాప్తుఁ డుదయాద్రి నెక్కు
కరణియా రథమెక్కి కమలాప్తకులుఁడు
శరదభ్ర సంధ్యాభ్రచయ సమానములు
గరుడోరగాసుర గణ విమానములు
సరిజూచు సురలు ఖేచరులుఁ గిన్నరులు
పరువడి ఆగములు భయమందనపుడు
వసనిఫ యుగము పాతకయుగంబు
ఘనగిరి ద్వంద్వంబు గగన యుగ్మంబు
కదిసి పోరాడె దినకరణి ఘార్మంబు
వదలక రామరావణులు పేర్చుచును
దినకరానల కల్ప దీర్ఘ నిఘాత
సునిసితాస్త్రంబులు సొరఁ బిమేనులను
కరముల భుజముల కర్ణమూలముల
నురముల ముఖముల నూరు కాండముల
నెక్కి నొప్పింపుచు నిద్దరు కడిమి
మిత్రాసులై దొరళి విత్రాసులై మెరకి
యార్చుకయ్యము కాయ యప్పుడొండొరులు

సొంపు పెంపును త్రెంపు చూపుచు పోర
నలినవ్విధమురారి నారి సంధించి
తలకొన్నదేవ గంధర్వ బాణముల
పరువడి వేయంగ ప్రతిబాణములను
మురియలుగా చేసె మొనసి రాఘవుఁడు
అనలాస్త్రమేసె లంకాధిపుండపుడు
జనపతి వారణాస్త్రంబు ననఁచ
అలసి రావణుఁడురగాస్త్రంబు వేయుటయు
గరుడాస్త్రమున ద్రుంచె కాకుత్స్థకులుఁడు
కనలి రావణుఁడు రాక్షస బాణమేసె
వనజాక్షుఁడది ద్రుంచె వాయువ్యాస్త్రమున
సురవైరి కోపించి శూలంబు వైచె
దురమున శక్తిచేదునిమె రాఘవుఁడు
పది ముఖంబుల వాఁడు పంతంబుతోన
పది వింట్లుచేబూని పది దిక్కులదర
శరవృష్టి ముంచిన సురనాథుఁడపుడు
సురపక్షగాదులు చోద్యంబునంద
తానేక కోదండ ధారియైయుండి
వాని కస్త్రము లెల్లవడి ద్రుంచి వైచె
రావణుండలుక శ్రీరఘురాము మీద
వావిరి నమ్ముల వానలు గురిసె
గుదికొన్న కోపంబు కొలది మీరగను
పదియింట మాతలి పదియింట హరుల
వికల సత్త్వుల చేసి విషమాస్త్రమేసి
ప్రకటంబుగా ద్రుంచె పటు కేతనంబు

విపుల చింతాభార వివశు దైవికుఁడు
తపియింపుచుండ సత్త్రియుఁగస్త్యుండు
చనుదెంచి ఆరామచంద్రునీక్షించి
ఘనుజేశయిది శౌర్య మంత్రంబుసార
ఘనువంద పఠియించి అరిని నిర్జింప
మని కుంభసంభవుండరిగిన పిదప
ఆదిత్య కులనాథుంపతి భక్తితోన
ఆదిత్య హృదయ మంత్రావర్తిచేసి
ఘోరావలోక నాగ్నులు ప్రజ్వరిల్ల
భూరి ధూమ్రాయత భృకుటి నిట్టింప
దండతేజమున ప్రచండకాండముల
నిండార నసురపై నిగుడించి చూచి
ఖనశాత కర్తరి క్రకచ భల్లంబు
యినవంశ వల్లభుఁడే సగ సందించి
నరుడంచ కాంచె నద్దశాననుడి
శిరములు బడియుచు చేతులిర్వదియు
కరములిర్వదియును ఘన కిరీటముల
శిరములు బడియును చెచ్చెర మొలిచె
మొలచిన కోపించి మొనద్రుంచె ఘొసుడ
తలలును చేతులు తద్దయు మొలిచె
తలలును చేతులెంతయు ద్రుంచిద్రుంచి
అలసి రాఘవుఁడుండ నవ్విభీషణుఁడు
దేవ రాఘవవీఁడు తెగఁడెందు చేత
వావిరి సుధనాభిపడినుండ జేసి
ఆనల బాణంబేసి అమృత మింకించి

మనుకొని బ్రహ్మాస్త్రము నశియించి చంపు
మనపుడు రఘురాముడాగ్నేయ బాణ
మను మంత్రమేయ నయ్యమృతంబుగ్రోలె
ఒక తలతో కరయుగ్మంబు తోన
ప్రకటించి నిలిచిన వం క్తికంధరుడు
అక్షయ బలశౌర్యుడగు రామచంద్రుడు
రక్షయ బ్రహ్మాస్త్రమపుడు సంధించి
దేవారి యురముపై బ్రుష్టించి యేయ
నావేళ బ్రహ్మాండనుగల దిక్కతులు
ఘీల్లీ లోకముల్ బెదిరి కంపింప
పాతాళవాసులు భయమందియురక
పచ్చియా రావణు వక్షస్థలంబు
బ్రమ్మర చనుదెంచి రాముస్థకులుని
అమ్ముల పొదచొచ్చెనద్భుతంబుగను
అమ్ముల పొదచొచ్చె నద్భుతంబుగను
పరమేష్ఠి మనుమని వం క్తికంధరుని
దురమున దొరిగొన్న దోషంబుతొలంగ
పాతాళ గంగలోపల గండివచ్చి
సీతాదివతిమాట చేరెనో యనంగ
తలడుంచు కూలె నద్దశకంఠుడపుడు
ధూళి సాహసిని బద్దకొంద చందమున
సంతసిల్లెను దేవ సంఘమ్ములపుడు
సంతసిల్లెను కపిసైన్యంబులెల్ల
దివినింద మ్రోగెను దేవ దుందుభులు
భువినిండ గురిసెను పుష్పవర్షంబు

రావిరి చెలరేగి యున్నరక్త్రులు
పాడిరి గంధర్వవరు లుత్సహించి
రాముఁడు లోకాభిరాముఁడై విజయ
ధాముఁడై నవసుధా ధాముఁడై యొప్పె
నంత విభీషణుఁడన్నను జూచి
సంతపింపుచు నుండె సమర మధ్యమున
నపుడు మండోదరి యాదిగా గల్గు
చపల లోచనలెల్ల సకల భూషణము
లడుగులు తడబడ హారముల్ చదర
తొడబడి కన్నీరుతోవలై దొరుగ
వచ్చి యా సంగరవసుధ నీక్షించి
రచ్చట మిన్నంది యేడు భూతములు
దయతోడ తమ బంధుతతులను బిలిచి
ప్రియములొకటుత విందుబెట్టు భూతంబు
నా రక్తధారల నందంద గ్రోలి
శ్రీరాము సన్నుతిసేయు భూతములు .
శిరముల మెదడులు చిగురు మాంసములు
పరువడి భక్షించు బ్రహ్మరాక్షసులు
ఘోక కాకపిశాచ ఘోరబేతాళ
శాకినీ ఢాకిర సమరాంగణంబు
జొచ్చి ముందరను నిస్తుల బొణిశయ్య
వచ్చి నెత్తురుతో పడియున్న వాని
వీర లక్ష్మీఘన విరహాగ్ని వలన
ఊరి నిద్దురబోవు దశకంఠు జూచి
రరుచుగా విలపింపదనుజ కామినులు

పరగ మందోదరి పతిమీద వ్రాలి
హా! రాక్షసేశ్వర హా! మహావీర
హా రణలంకాపురనాథ యనుచు
పలుమారు లంకాధిపతి పరాక్రమము
తలచి శోకింపుచు ధరపైని వ్రాలె
అంత రాముడు రావణానుజు జూచి
చింతింప వలవదు శీఘ్రమే నీవు
పరగ రావణునికి పరలోక విధులు
కరమర్థి సేయుము కరుణతో బోయి
యనుడు విభీషణుడౌగాక యనుచు
దనరంగ నటువలె తగనాచరించి
పరిశుద్ధుడై వచ్చి భానువంశజుని
చరణాంబుజములకు సాగిలి మ్రొక్క
జనవిభుడా విభీషణుని మన్నించి
చనవు రెట్టింపగ సౌమిత్రి కనియె
మొనసి మండోదరి మొదలైన దనుజ
వనితల మన్నించి వారి దోడ్కొని సురు
సేవింప లంకలోనికి బోయి పుణ్యు
డాపు విభీషణు పట్టంబుగట్టి
రమ్ము పొమ్మనవుడు రామునానుజుడు
నెమ్మితో లంకలోనికి బోయి యపుడు
తదయుక తదుపరి త్రములను బనిచి
కదగి సముద్రోదకముల దెప్పించి
వారి పురోహితవరులతో గూడి
వారి సుమంత్రుల వరుస రప్పించి

భూరి మంగళ తూర్యములు మ్రోయనతనీ
యా రూఢ నియతితో నభిషిక్తుజేసి
కరమొప్ప యతని లంకా రాజ్యమునకు
పరమ సమ్మతమున పట్టంబుగట్టి
జలనిధులును సూర్యచంద్రులెందాక
కులగిరులును తార కోటు లెందాక
జగతి యందాక దిక్చయము లెందాక
జగదేక రామ చరిత మెందాక
నందాక నీవు లంకాధి పత్యంబు
చెంది వర్ధిల్లుము శ్రీరాము కరుణా
నను విభీషణుఁడ లల రాజ్యంబు
గానిమంచి తొడవులు కొంచు సౌమిత్రి
కొలచి వెంబడివచ్చి కులవలయాధిపుని
కలరుచు మ్రొక్కి దివ్యాభరణములు
చెలువొంద నిచ్చిన చేకొని రాము
డెలమితో మాతలికిచ్చి వీడ్కొలుప
మాతలి రథమెక్కి మహనీయ మహిమ
నాతత రథ వేగుఁడై బోయె దివికి
తదనంతరంబున ధరణీవల్లభుఁడు
మదిని విరాజించి మారుతి జూచి
జనక పుత్రికి మనజయము సేమంబు
వినుపింప లంకకు వేగపొమ్మనుఁడు
దని హనుమంతుఁడు జనక నందనను
కని మ్రొక్కి నిలిచి యొకల్యాణ రామ
ధరణీశ్వరుఁడు వచ్చి దశముఖు గూల్చి

పరమ సంతోష సంభరితుడై నాఁడు
పరగ సౌమిత్రి సద్భక్తి కొల్వఁగను
తరుచరావళు లెల్ల తను భజింపఁగను
మున్ను నే జెప్పిన ముఖ్య లక్షణము
లన్నియు నిజమయ్యెనని విన్నవింప
దేవి సంతోషాబ్ధి తేలి మారుతిని
భావించి దీవించి పలుమారు పొగడ
హనుమంతుడందున యసుర కామినుల
కని తల్లియును నీకు కాని యీపట్ల
ఘన ముష్టినిహతుల కడదేర్చి బుత్తు
ననుచుండ జానకి హనుమంతు జూచి
యేసినవాడుండ నిమిషులేమి జేయు
దాసీవధంబెందు తగదు చింతింప
పొమ్ము నాయెడ ప్రేమ పొసగ మెయట్ల
నెమ్మితో బలుకుము నృపవర్యు కనిన
విని మ్రొక్కి మారుతి వేగంబె బోయి
జననాథునికి సమాచారంబు జెప్పె
జననాథుఁడా విభీషణుచార బిలిచి
జనకజ మంగళస్నానంబు సేయ
బనచి దివ్యాంబరాభరణ మాల్యముల
పనుపడి జేయించి పరగతో దెమ్ము
మనుడు విభీషణుఁడంగనా మణుల
ననుపహారులు బోయి పరగ గై జేసి
యసమాన మహిమతో నసుర కామినులు
పసిడి పల్లకియందు పణతుక నునిచి

వచ్చి దూరంబున దేవిని విడిచి
వచ్చి రాఘవునికావార్తలు దెల్ప
పిలిచి తెమ్మనుచు విభీషణుంతలిగి
కేవల భక్తితో కీర్తించుకొనుచు
దేవి జానకితో దెచ్చుచో కడని
ఘనవేత్ర హస్తులై కపులు రాక్షసుతో
కనుగొని సందడి కతకుతోలగను
నాహహా కలకలంబవ్వ జాలించి
రాముండు రాక్షసరాజు నీక్షించి
నింప వారెవ్వరు వీరితో మనకు
యింత నొప్పింతురె యిచ్చంగి కదఁగి
వారింప పలవదు వచ్చియందరను
గారవమ్మున సీత గనుగొని నిమ్మ
ననుఁడు విభీషణుఁడా రామునాజ్ఞ
కనకాంగితో దెచ్చె గడిమె తోడుతను
కోమలి నేత్ర చకోరయుగ్మంబు
రామ చంద్రానన రాకేందు కళల
గ్రోలి వియోగాగ్ని గప్పున నణచె
నాలోన సంప్రాప్యమై సీత నిలువ
మానిని జూచి యమ్మనుజేశుఁడనియె
మానంబు రక్షింప మర్దించి రిపుని
తివిన నిన్ను సాధించితిగాని
యువిద నీయెడ ప్రీతి యుక్కింతలేదు
పగవాని కొంపలోపలయున్న నిన్ను
తగిలి సుఖించుట ధర్మమే తనకు

ననవుండు జానకి యాత్మలోఁ పుగిలి
కనుల బాష్పమ్ములు గ్రమ్మ నిట్లనియె
యెరుగవే నీవు నా హృదయంబు రామ
పరకాంతవలె నిన్ను పలుకఁగ దగవె
నీ సంశయము బనించిన యపుడె
శోకతో నగ్నిలో జొచ్చెదనుఁడు
అనినాథ కనుసన్న సౌమిత్రి దెలిసి
పెనుపొందనట సౌద బేర్చెనంతటను
మదిరాతి ప్రణమిల్లి మదిలోన రాము
కడియించి సౌదచుట్టు గరిమెతో తిరిగి
వనజాయతాక్షి కేవల భక్తితోన
సనల దేవునికిని హస్తముల్ మొగిచి
సకల ధర్మములార చంద్రార్కులార
ప్రకటింతునిపుడు నా శాపంబు వినుఁడు
ఘన మనోవాక్కాయ కర్మములందు
జననాథుఁడగు రామచంద్రుడు దక్క
పరుభవించితినేని ప్రళయాగ్ని నన్ను
పొరిగొనుకాక నిపుడె చూడుఁడనుచు
జలజాక్షి సంతత జ్వాలాకరాళ
కలితాగ్నిలో జొచ్చి కదలక నిలిచె
యా విభీషణు లక్ష్మణార్కజ ప్రముఖు
లా వేళ శోకార్తులై యుండిరంత
సర్వలోకంబులు చలియింపఁగ
నిర్వాణుఁడై యుండ న్నపుడంతలోన
పరమేశ్వరుఁడు పద్మభవుఁడు దేవేంద్ర

గరుడ గంధర్వాది ఖచర వల్లభులు
వర విమానస్థులై వచ్చి యంబరున
వరఁగ ప్రత్యస్థానపరుడైన రాము
గని నుతింప జగత్కారణ మీవె
వనిపతిగా పరబ్రహ్మంబు నీవే
నీవె వేదంబులు నీవె మంత్రములు
నీవె లోకంబులు నీవె సురగణులు
నీవె యక్షరములు నీవె మోక్షంబు
నీవె సాక్షివి రామ నిత్యుఁడు నీవె
నరనాథ నీవారి నారాయణుండ
వరసి జూడగ సీత యయ్యాది లక్ష్మి
నిన్నాళ్ళలు తెలియవు నిష్ఠుర వసి
నున్న సీతను జూచుచుండుట తగదె
ఆసరఁ జేకొమ్ము జగదేకనాథ
యని పెక్కు భంగుల నాడుచుండగను
విశ్వమంతయు జూచి విస్మయంబొంద
వైశ్వానరుండంత వడలని ప్రేమ
కోమలి తగనెత్తుగొని వచ్చి వేగ
రామునితోడనుండి రాముతోననియె
సరసగుణ ప్రాత జగదేక మాత
పరమ పతివ్రత పావని సీత
యీ కాంత యెడ పాపమిందాకన్నైన
లేకొని రక్షించు శ్రీరామయనుఁడు
వసుధీశుఁడపుడు దేవతుల కిట్లనియె
కుసుమ కోమలి సీత క్రొత్తయే తనకు

మలయు ధాత్రీపుత్రి మనసు మర్మంబు
తెలివిడి తనకన్ని తెలిసిగాని
యరసి నేనిపుడు లోకాపవాదంబు
పరిహరించుటకై వద్దు జేసితిని
యుస చంద్రశేఖరుంత తని కిట్లనిగె
దనరగ మీ తండ్రి దశరథాధీశుడ
దేవి మారూడుడై యున్నవాడు
కదిసి పూజలు నీవు గావింపు మనిన
నను అస్మతో రాముడతి భక్తినేగి
తన తండ్రి నీక్షించి తద్దయు మ్రొక్క
చిత్తము రంజిల్ల శ్రీరామచంద్రు
నెత్తి కౌగిట జేర్చి యినవంశుడనియె
నా కూర్మి నందన నా రామచంద్ర
కైకేయి మాటకై కటకటా నిన్ను
బాసితి సుఖమింత బడయలేనైతి
గాసికి లోనైతి కడు వెర్రినైతి
పరువడి నిను నేడు చూచిన వలన
సురలోక సౌఖ్యంబు శోభించదయ్యె
నీ వయోధ్యకు బోయి నిఖిల ధర్మములు
భావించి రాజ్యంబు పాలించు మనుచు
ప్రేమతోడుత పల్కి ప్రియ సుతుండైన
సౌమిత్రి కనుగొని సౌమిత్రి నీవు
మెలకువ నిటుమీగ మీయన్న మనసు
నలగకుండగ నీవు నడువుమీ యనుచు
ఘన భక్తితో మ్రొక్కి తలపంచి యున్న

జనక నందన జూచి జననాథుఁడనియె
పరమ పతివ్రతా ధరణంబు నీకు
సరి యెవ్వరు ధర సాధ్వివి నీవు
నిను రాముఁడాడిన నిష్ఠురోక్తులను
మనమున నెంచక మది నొప్పటోక
ఘన కీర్తియుతుల రాఘవుబోలు సుతుల
కనుము ధర్మంబులు కైకొను ననుచు
దీవించి చెలఁగి ధాత్రీపతి సుకుల
భావించి సంతోషభరితుఁడై యుండె
సురపతి రఘురాము జూచి నీకిత్తు
వరములు కోరెన్న వసుధీశుఁడనియె
నా కార్యమునకు రణంబుతో నెదిరి
యీ కపుల్ ప్రాణమ్ము లిచ్చియున్నారు
వీరుల బ్రతికింపవే దేవయనుఁడు
వారల బ్రతికించె వాసవుండపుడు
వనచరు లెల్లను వర్ధిష్ణులగుచు
కినిసి రామునికి మ్రొక్కిరి ముదంబునను
దేవ సంఘమ్ములు దివికి రాఘవుని
దీవించి వేవేగ దివి కేఁగెరంత
నా విభీషణుఁడు దివ్యాంబరమ్ములు
జీవరత్నంబులు చిత్ర వస్తువులు
తెచ్చి రాఘవులకు దేని భూపుత్రి
కిచ్చి వీడికి బిల్వసంపుడనియె
కడఁగి యుభోగముల్ కడు పెక్కు గలపు
తనయక మాఱయోధ్యకు బోవలయు

విను విభీషణ కపుల్ వీరు లంకేంద్ర
ఘన సర్వ ఘోరాంధ్రకార భాస్కరులు
ఓరి పూజింపుము వేగంబె యనుఁడు
వారికి తోడపులవ్వారిగా నిచ్చి
నానా మణిస్తంభ నవరత్న చిత్ర
నానాంబరోవృతోన్నత కేరనాంక
పుష్పగంధార్చిత స్ఫుటి రాజరాజ
పుష్పకంబప్పుడావ్వగ దెచ్చియుంః
జనకజా లక్ష్మణ సహితుఁడై రాము
డసనాథుఁడంత పుష్పకము పూజించి
తగ ప్రదక్షిణముగా ఘనఘ పుష్పకము
జగదీశుఁ డెక్కి యుర్వ్యాహంబులోన
కడఁగి సుగ్రీవాది కపులను జూచి
కడగండ్లకోర్చి యీ కార్యముల్ జేసి
యలసియున్నారు మీకాత్మ గేహముల
కెలమి బోందనుఁడు వారాసించి రాము
నమరంగ నీదు పట్టాభిషేకోత్స
వము జూడవలె నన్నవారి మన్నించి
పదువడితోన పుష్పక మెక్కి యున్న
పరమ పావనులు పుష్పక మెక్కిరంత
దనుజాంగనలు సహితనయకు మ్రొక్కి
చనిరంత నిజ నివాసములకు నెలమి
ఘన భక్తితోతన కరములు మోడ్చి
జనపతి కా విభీషణుం డిట్లనియె
యెలమి యీ పుష్పక మెందరెక్కినను

విలసిల్లి యొక మూల వెలితియైయుండు
సనరాము బసువున సఫల స్థలంబ
లనుపమాయత పుష్పకారుండులైరి
సామర గంధర్వ సంచరితు తలిత
హేమాద్రియన మింటికెగసి పుష్పకము
ఘన మనోవేగంబు గైకొనితోప
జనకజతో రామచంద్రు డిట్లనియె
యీలంక జానకి యీక్షింపు దీని
యేలజాలక భోగమెల్లను మాని
సుదయితుండై వచ్చి మార్కొని నన్ను
పది ముఖమ్ములవాడు బడియె నిచ్చటను
కడఁగి యిచ్చట కుంభకర్ణుఁడు గూలె
పడె ప్రహస్తుండిందు పద్మాయతాక్షి
యిచ్చటధూమ్రాక్షు డిచ్చట కుంభు
డిచ్చట నతికాయుఁడిచట నికుంభు
డిచ్చట మకరాక్షుఁడిచటను పార్శ్వుఁ
డిచ్చట పడిగూలె నింద్రజిత్తుండు
బలిగావసథిపై భాసిల్లు పుణ్య
హేతుసేతువు జూడు మిందీవరాక్షి
యిదె సదాశివ సమాహిత నివాసంబు
మదిరాక్షి సేవించు మనసు రంజిల్లు
యిదె గంధమాధనమిదె దర్భశయన
మదెవాలి పాలితమైన కిష్కింధా
యన రాము గనుగొని యాసీత బలికె
మనుజేశ సుగ్రీవు మగువలతోన

మన పురంబునకేగమరి కోర్కెలుబ్బె
ననవుండు పుష్పకంబై యదనిచ్చి
తారాది కాంతల దనరగప్పింప
వారు సీతకు(మ్రొక్కి వలనొప్ప పుష్ప
కారూఢులై నంత నరిగె పుష్పకము
శ్రీరాముఁడాడుతోడనే సీతను జూచి
మగిదె ముందర ఋశ్యమూరంబు జూడు
చిగురు చోణారాజాడు దెలఁగుని పంపా
జలజ బాంధవ తనూజాత సఖ్యంబు
కలిగె మాకెక్కడ కమలాయ తాక్షి
యిదె పంచవటి జూడుమిదె పర్ణశాల
యిదె రావణుఁడువచ్చి యెలయించి నిన్ను
కొని చన్నతావు గక్కొన జూడుమబల
మునియగస్త్యాశ్రమమును జూడు మింతి
మిదె శరభంగుని యాశ్రమంబబల
మిదె యత్రియాశ్రమ మిదె చిత్రకూట
మిదె భరద్వాజుల యాశ్రమంబనుచు
పొరలి సీతకును జూపుచురాగ నంత
పదునాలుగవ యేడు పరిపూర్ణముగను
పదపడి వర్తించు పంచమినాడు
సక్రాంత శతతేజుఁడగు భరద్వాజు
కాశ్రమో పరివీథిన వ్విమానంబు
పాయక నిల్పి సద్భక్తితో డిగ్గి
యా యాశ్రమంబున కర్థినేతెంచి
యమ్మునికిని మ్రొక్కి యతఁడు దీవింప

సమ్మతి రామచంద్రుడు దిప్పనియె
కలదుగదా మీకు కందమూలములు
ఫలములు జలములు పాయంబులేక
నెరవేరుచున్నదే నిత్య కర్మములు
చిరుతగుటంబులె మీకు శిష్యులకెల్ల
ననఁపుడు మునినాథుఁడా రాము జూచి
వినయ వాక్యమ్ములు వినిసంతసిల్లి
నిఖిలలోకారాధ్య నీవు జన్మించి
నిఖిల లోకంబులు నిష్టపాలింప
కలదె సంకటములు కలనైనగాని
చెలువొప్పగా నీవుజేసిన సాహసంబు
తెలిసెను సుజ్ఞాన దృష్టిచే మాకు
నిలిపి పాదు కలను నిఖిల రాజ్యంబు
భరతుఁడు మునివృత్తి భక్తితో బూని
గురుగొని నీరాక గోరుచున్నాడు
నీవు నీ తమ్ముని వినయంబు దలఁచి
వేవేగబోవ భావింపగ వలయు
వనవాసము నడసి వచ్చిన వాఁడ
వనఘమాయాశ్రమము మందునేడుండి
బోవుదునని విందు పొలుపొందనందు
గావింప రఘుపతి కపులతో గూడి
పనువడి భుజియించి పరితృప్తిబొంది
హనుమంతు జూచి నీ వరిగి వేడంబె
మొసనినంది గ్రామమున నున్న భరతు
కైనయంగమారాక వెరిగింపు మనుడు

కరములు మోగిడించి కపికులోత్తముడు
భరతు చెంతకుబోవ భరతుఁడా వేళ
రాడాయనింకమా రామచంద్రుండు
కీడేమి బుట్టెనో కెదలి రాఘవుల
కని తల్లడిల్లుచు నటుసార బేర్చి
దనియనే జోరజూచు సమయంబు జూచి
వలదు హాహాయని వారించు కొనుచు
వలనొప్ప వచ్చి యా వాయునందనుఁడు
భరతుని కపుడు భక్తితో మ్రొక్కి
నరలోక పాల మిన్నాకముదంబునను
జానకి లక్ష్మణ సహితుఁడై రామ
భూనాథుఁడిదేవచ్చె పొందుగా ననవుఁ
డామాటలంమృతంబై పొడసోక
తామేను మరచి చిత్తరుబోలి యుండి
పులకలు నెమ్మన బోడమనేత్రముల
పలుమారు నానంద బాష్పముద్గమ్మ
కడుకూర్మి హనుమంతుఁ గౌగిట జేర్చి
తదయక కపికులోత్తము శిఖామణికి
కరి తురంగ రథాంగ కాంచనా భరణ
నరసాంబ కాదుల సంప్రీతి నొసఁగి
హనుమంతు చేత సప్పుడా రామకథలు
వినికూర్మి తమ్ముని వీక్షించి సిపు
సాకేతపురమెల్ల సంతసంబునను
శిఖరంబుగను కైసేయించు మిపుడు
గొనగొని శ్రీరామ కొలువు హటమున

ఘనసేతు ఖంధాది కథలు వ్రాయింపు
నవరత్నమకరతోరణము లెత్తించు
నవరణ వీధుల చక్కబెట్టించు
యలిరోచి మృగనాభినంగళ్ళయందు
వెలలేని వస్తువుల్ వేయించు మచట
కోట వాకిండ్లను కొమరొప్ప నీవు
హాటక రంభాదులమర కీలిందు
శ్రీరామ విభుఁడు వేంచేసినాడనుచు
వారివారికి బంధువర్గమ్ములకును
తీరుగా వ్రాసి పత్రికల నంపించు
దారుచే సీమ దాటింపుమనుచు
భావించి శ్రీరామభద్రుని నగరు
నీవు సన్నిధినుంచి నెరియరై నేయు
ఘనవిని శత్రుఘ్నునాగాక యనుచు
చనియట్లు గావించి సరగున వచ్చె
నరన వసిష్టాది సంయమీశ్వరులు
పురినున్న జనము లా భూసురోత్తములు
తల్లులు మంత్రులు తగిన బాంధవులు
పల్లవింపుచు రాగ భరతుఁడు కదలి
రాముని కెదురుగా రయమున రాఁగ
నా మారుతాత్మజుండనియెనాతనికి
గలదెటోఁడు రాఘవుఁడా భరద్వాజు
నరసంబునందుండి చనుదెంచు రవము
లదె కాడు పుష్పకంబదె జూడు రాము
నదెజూడు సౌమిత్రి నదెజూడు సీత

నదెచూడు సుగ్రీవుఁడదె విభీషణుని
నదెచూడు నంగదు నదెచూడు నీలుఁ
డన విని భరతేశుఁడవ్విమానంబు
కనుగొని దాసుడౌగ నీక్షించవగుచు
ఘనత దవ్వుల కడుభక్తి మ్రొక్కి
యన్నను సాష్టాంగమపురంగఁ జేసి
యంతనా పుష్పకంబవనికి నిలిచి
యంతయు హర్షించి యినకులేశ్వరుఁడు
దండిగ భక్తితో తల్లులకెల్ల
దండ ప్రణాముల్ తగనాచరించె
పరువడివారలు వరఁగ దీవించి
పరిరంభణముల సంభావించిరపుడు
భరత శత్రుఘ్నులు ప్రణమిల్లి రంత
పరిపూర్ణుఁడగు రామభద్రుని కెలమి
యత్తరి భూపుత్రి యధిక సంప్రీతి
యత్తల కెల్లను యతిభక్తి మ్రొక్కి
మ్రొక్కిన కోడలిమోగి కౌగిలించి
యొక్కట దీవించి యుండిరందరును
నరగున రామలక్ష్మణుల సద్భక్తి
గురువసిష్ఠునికిని కొమదొప్ప మ్రొక్కి
యాలింగనముజేయ యతడు దీవించె
నాతోన భరతేశుఁడర్కపుత్రాది
కపుల నందరి తన కౌగిట జేర్చి
వీపుల సమ్మదమున వినుతించె నతఁ
డన బాంధవులతోన తల్లులతోన

దీన నాథసులుఁడు నంత గ్రామమునందు
వచ్చెనా భరతుండు వతని పాదుకల
నిచ్చి సామ్రాజ్యమ్మియ్యెడ నొప్పగించ
తమ్ములతో గూడదనర రాఘవుఁడు
నెమ్మితోడను గూడి నిడుద కెంజడలు
సదరించి పడిశుభ స్నానముల్ జేసి
కడువడి మునివృత్తి కానల కనచి
దివ్య భూషణముల దివ్యాంబరముల
దివ్యగంధమ్ముల దివ్య మాల్యముల
కరమర్థి ధరియించె కాకుస్థకులుఁడు
ధరణి తనూజకు దశరథాంగనలు
పరము ప్రియంబుగ కై జేసిరంత
గరిమె రాముడు పుష్పకమున పూజించి
పనిచ కుభేరుని భవనంబునకును
గొనకొని మారుతి గుహుని తో డ్తేర
ఘన జటావల్కల కలితుఁడై గుహుఁడు
దనుదెంచి శ్రీరామచంద్రుని చరగ
నతని కౌగిటజేర్చి హర్షించి రాముఁ
డతని వల్కలజటలపుడు తీయించి
కనకాంబరాదుల కై సేయ బనిచె
పనిచిన శృంగార భరితుఁడై గుహుఁడు
ఘన భక్తితో రాఘవుగొల్చి యుండె
తన వారితోడుత దశరథాత్మజుఁడు
కనక రత్నప్రభా కలిత శతాంగ
ముననెక్కి వనచర ముఖ్యులు గొల్వ

పంచ మహాకావ్య పటునాటయసగ
సంచితంబుగ షేమలా పరచ మురయ
శ్రీకర సకల లక్ష్మీధామమైన
సాకేతపురి రాగ జననాథపుఁడు
తళుకు బంగారు సౌధముల రాజిల్లి
చెలియలు ముత్యాల కాసలు జల్లి
స్వస్తి వాచనముల సకల భూసురులు
ప్రస్తుత పూర్ణకుంభము లొప్పతెగ
ఆగములువొప్పంగ నిర్జరులు నుతింప
నగరు ప్రవేశించె నరనాథుఁడంత
భరతుఁడు శ్రీరాము పంపున నపుడు
సరసాన్న కలభక్ష్య సద్వస్తువులను
పరితృప్తులను జేసి ప్లవగ వల్లభుల
సౌరది సుగ్రీవుని జూచి యిట్లనియె
శ్రీరాము పట్టాభిషేకంబునకును
భూరిని కదినట పుణ్యతీర్థములు
తెప్పింపమనపుఁడు దిననాగ సుతుఁడు
తెప్పించె కపులచే తీర్థమ్ములన్ని
యంత వశిష్ఠ సంయమి మహామునుల
సంతసంబున గూడి సమ్ముహూర్తమున
కనకరత్న ప్రభాకలిత పీఠమున
ఆలకజతో రామచంద్రుని నునిచి
ఉనరసామాది వేదములు ఘోషింప
మునులు మహామంత్రములు పచింపగను
ఘనుపడి తీర్థ సంభరితంబులైన

కనక కుంభములు కరముల బూనీ
శ్రీరామునకు నభిషేకంబు సేయ
వారి పూరంబుల వ్వారిగా నించె
చిరకాంతి నుదట భాసిల్లు పట్టమున
పరగెను శశికళా ధరుఁడుని మాడ్కి
కిన్నర గంధర్వ గీర్వాణ యక్ష
పన్నగోరగ సిద్ధ పతులుత్సహింప
కురిసె పుష్పులవాన గుప్పున నవ్వు
తెరగొప్ప మ్రోగెను దేవదుందుబులు
పాడిరి గంధర్వ పతులు రంభాదు
లాడిరి వీచె మందానిలంబంత
సురపతి మందార సూనమాలికలు
కరమర్థి నంపింప గైకొని రాము
ధారాధి సింహసనా రూఢుడయ్యు
భూరిన స్వాదుల పొలసె భూదేవి
సలసుమంబులతోన బాసిల్లె తరులు
విలసిల్లె దిక్కులు వెలిసె లోకమ్ముల
లాలోన రఘురాముదర్థ రాసులను
వేలారు కోటుల విప్రుల కొసంగి
లక్ష గుర్రముల లక్ష యేనుగుల
లక్ష ధేనువులను లలినొప్పనిచ్చెఁ
కాంచన సుమమాలికా భూషణంబు
లంచితంబుగ నిచ్చె నటుభానుజునికి
కనకాంబరమ్ము లంగదునికి నొసంగి
హనుమంతునికి కంకణాదుల నొసఁగి

హారకేయూర దివ్యాంబరంబులను
సారంబుగా విభీషణునికి నొసఁగె
దరమెచ్చనిచ్చె తోక్కసముగా నీలునికి
నవరత్న పతకంబు నలునికి నొసఁగె
ధరణి తనూజకు దయ తలర్పగను
మురువుగా నిచ్చెను ముత్యాలదండ
శ్రీరామునను మతి సీత సంప్రీతి
హారమర్పించె నాంజనేయునికి
హారంబు ధరియించి యనిలజుండొప్ప
శారదాభ్రావృత శైలంబు మాడ్కి
అంత వసిష్ఠుని యనుమతి రాముఁ
డంతఃపురమున కరిగి సంప్రీతి
తన తల్లులకు మ్రొక్క దయమీరవారు
దనర దీవించిరి ధరణితనూజ
యత్తలకు మ్రొక్క యవనితనూజ
నెత్తిరేగిట జేర్చి యెలమి దీవించి
రపుడు రఘురాముఁడఖిల బాంధవుల
నప్పించి వానర రాక్షసాధిపుల
సహపంక్తినిడుకొని సరసాన్నములను
గొమరొప్ప భుజియించి కౌతుకంబునను
జలముల నాగినార్చి సంభ్రమంబునను
లలిత సుగంధమాల్యము లొప్పముడిచి
కలితానురాగులై కడఁగిరందరును
శ్రీరాముఁడప్పుడు చెలఁగి సింహాస
నారూఢుఁడై సభనుంపరి చెలమి

కపురపు పీడెముల్ కనకాంబరాదు
లుపచార పూర్వకమొసగి పిల్కొలుప
యా విభీషణ భానుజాదులు మ్రొక్కి
చావిరి తమతమ నివాసంబులకును
జనిరి శ్రీరాముఁడుత్సవ కేళిదేలి
పసువడి యువరాజ్య పదమున భరత
మనుభవింపుచు రాముఁడపనిజతోన
సౌమిత్రులను నిల్పి సామ్రాజ్య సౌఖ్య
మామహీజను గూడి యనుభవింపుచును
రాజిల్లి రాముఁడు రహిఁ నశ్వమేధ
వాజపేయాదుల వరుస జేయుచును
ధర్మంబు నీతియు తప్పక ప్రజల
కూర్మిఁ బ్రోచుచు పదకుండు వేలేండ్లు
పాలించె రాజ్యంబు ప్రజల ధర్మాత్ము
లై లక్షణాఢ్యులై లమరిరపుడు
తూలె దుర్భిక్షముల్ తొలఁగె పాపములు
తాలిమియును సత్యధర్మముల్ బొల్చె
పరిహితా చారుతత్పరులైరి మనుజు
లరుదుగా సంపదలభివృద్ధి పొందె
అనిభోసలాబ్ధి సుధాంశుఁడు త్రముఁడు
ధననాధతుల్యుఁడు దార విక్రముడు
సరస సాహిత్య లక్షణ చక్రవర్తి
కరుణా సముద్రుఁడు కవి కల్పకంబు
విలసిల్లు తుళజ భూవిభుకుమారకుఁడు
పొలుపొందు మేకోజి భూమిపాలకుఁడు

తన తండ్రి తుహజేంద్ర ధరణీశు పేర
పెనుపొంద సుకరంబ నిరుదాంపు పేర
రమణీయమైన యీ రామాయణమున
కమనీయమైన యుద్ధకాండంబు జెప్పె
నిదికుశజేంద్రుల కిడునెప్పుడిలను
పొదలు సంపదలును పూర్ణశక్తులును
సకల దీర్ఘాయుష్య సంతానములును
సకల రాజ్యంబుల సకల భోగముల
సమర జయంబుల సకల కీర్తు
లమరంగ నొసంగు మహారామ చరిత
మిది మహాపుణ్యద మిది వేదసార
మిది ముక్తిసోపాన మిది శుభోదర్క
మివ్వసుంధర భక్తి నెలమితో దీని
నెవ్వరు చదివిన నెవరు వినిన
నెవరు వ్రాయించిన నెవరు వ్రాసినను
భువిలోన వారికి పుత్ర సంపదలు
ఘనమైన కీర్తులు కరితురంగములు
మనసు రంజిలజేయు మానినీ మణులు
పరగ దీర్ఘాయుష్య భాగ్యంబు లొసగు
ధరణిలో నాచంద్ర తారార్కముగను

—: శ్రీరామ చంద్రాయనమః :—







**డా॥ ఎం. భాగయ్య**

జన్మస్థలము : గ్రా॥ మొరంగపల్లి, తా॥ మర్పల్లి, జి॥ రంగారెడ్డి.

విద్యార్హతలు : M.A; M.Phil; Ph.D; P G. Diploma in Applied Linguistics

ఉద్యోగము : తెలుగు లెక్చరర్, ఉస్మానియా విశ్వవిద్యాలయ మహిళా కళాశాల, కోఠి, హైదరాబాదు

అభిరుచులు : తెలుగు భాషాసాహిత్యముల అధ్యాపనము, అభినయము, వ్యాసరచనాభిలాష

ప్రచురణలు :
1. సింహాచల మాహాత్మ్యము - ఒకపరిశీలన, M.Phil.
2. ఏకోజీ విఘ్నేశ్వర పరిణయము - పరిష్కరణ
3. ఏకోజీ రామాయణము - ద్విపద - పరిష్కరణ - సంపాదకత్వం
4. కూచిమంచి తిమ్మకవి జీవితము-సాహిత్యము, Ph.D.
5. చిరవిభవ శతకము - పరిష్కరణ - సంపాదకత్వం
6. భాగ్యరేఖ - కవితాసంపుటి